# ఆంధ్రమహిళ

(7)

## విషయ సూచిక





# పరదేశంలో పరపతి







భారత చేనేత వస్త్రాలు ఆఫ్రికా, అరబ్బు దేశాలలోను, తూర్పు అసియా తదితర ప్రాంతాలలోను విశేషంగా ప్రజాదరణను చూరగొంటున్నాయి. క్రిందటి సంవత్సరం ఎగుమతులు రు. 66 మిలియన్లను దాటాయి.

తనిఖీ, ఉత్తమ ప్రమాణాల సాధన విషయాలలో అమిత శ్రద్ధ చూపబడుతున్నందున, చేనేత వస్త్రాల నాణ్యత అభివృద్ధి చెందింది. వీటి గిరాకీ యింకా యింకా ఎక్కువౌతూ వస్తున్నందువల్ల, యిటీవల ఏడెన్, కొలంబో, బాంకాక్, క్వాలాలంపూర్, సింగపూర్‌లలో చేనేత విక్రయశాలలు నెలకొల్పబడ్డాయి.






## చేనేత వస్త్రాలు

భారత ఆర్థిక వ్యవస్థలో ఒక కీలక పరిశ్రమ




వ్యవస్థాపకురాలు : దుర్గాబాయి దేశ్‌ముఖ్

సంపుటి 16 :: డిసెంబర్, 1960 :: సంచిక 10

# భారత జాతీయ ఐక్యత

రైపూరు శుక్లానగర్లో సమావేశం అయిన అఖిలభారతకాంగ్రెసు సాధారణకార్యవర్గ సభలో 30-10-60-వ తారీఖున పంచవర్ష ప్రణాళికా తీర్మానాన్నిగూర్చి సభ్యులు చర్చించే సందర్భాన్ని పురస్కరించుకొని, మనప్రధాని వెల్లడించిన యీ క్రింది అభిప్రాయాలు గమనింప తగ్గవి :—

"జాతీయంగా మనం పురోభివృద్ధికి రావాల్నంటే, ప్రజాసమూహంలో వుండే ఆయా పరస్పర సాంఘిక సంబంధాలయిన విభిన్నదృక్పథాలలోనే మార్పులు కలగాలి. కేవలం శాసనాల చేతనే అట్టిపరివర్తనలు తీసుకురాలేం. ఏకజాతీయతా వికాసానికి అడ్డంకులుగావుండే బలహీనతల్ని, లోపాల్ని తొలగించాలి"

"కులవిభేదాలు, జాతీయతను నిర్మూలించే పరమశత్రువులనటాన్ని ప్రజలు విస్మరించరాదు. ప్రజాకోటిలో సమత్వం, సమరసభావం నెలకొల్పటమే సాంఘిక జాతీయతాస్ఫూర్తి యొక్క ముఖ్యసిద్ధాంతం. కాని మనం కులవిభేదాలు అనేవలలో తగుల్కొని అన్నివిధాలా అవస్థపడుతున్నాం. అంతేగాదు; ఈ కులవిభేదాలు రాజకీయంగాకూడా మనం అణగారిపొయ్యేట్టు చేస్తున్నవి,"

పండిత నెహ్రూగారి యీ అభిప్రాయాన్నే మరోవిధంగా బలపరుస్తూ డాక్టరు రాధాకృష్ణన్‌గారు 31-10-60—న న్యూఢిల్లీలో శ్రీ సర్దారు వల్లభాయి పటేలుగారి జన్మదిన వార్షికోత్సవ సభలో, ఈవిధంగా చెప్పారు :—

"కడచిన మనదేశచరిత్ర పరిశీలిస్తే— ఈనాడు ప్రతిభారతీయుడు ప్రప్రథమంగా— తాను ఒకేభారతజాతికి చెందినవాడననీ— ఆతరువాతనే తన కుల మత ప్రాంతీయాభిమానాలు గలవాడననీ మనస్సులో గాఢంగా విశ్వసించేమోస్తరు- చేయగలిగినప్పుడే- మనం స్వతంత్రైక్య

భారతానికి బలంచేకూర్చగలం. మతాలవారీగా, కులాలవారీగా దేశం ముక్కలుముక్కలై, ప్రజలు భిన్నాభిన్నం అవుతుంటే, మనం ఉపేక్షచేసేపక్షంలో— ఇదివరకు జరిగిన మన దేశ (చరిత్ర లోని) సంఘటల్ని పునరావృత్తిచేసేవారం అవుతాం అని హెచ్చరిస్తున్నాను.''

మహానాయకులు పైన చెప్పిన విషయాలకు అనుగుణంగా, ఇటీవల ఢిల్లీలో సమావేశం అయిన ప్రజాసోషియలిస్టుపార్టీవారు "జాతీయైక్యతకు భంగంకలిగిస్తూవుండే కులతత్వం ప్రాధానం గాగల, పార్టీలు, స్వార్థబుద్ధితో మతాలుగా నేర్పడ్డపార్టీలు తలెత్తకుండావుండేట్లు ప్రభుత్వం తగు చర్య అవలంబించా''లని ఒక తీర్మానం చేసింది. దాన్ని అనుసరించి, కృపలానీ, మెహతా, ఘోషులు ప్రధానివద్దకు రాయబారంకూడా వెళ్ళారు. ఇదిరాజకీయపక్షాలకు సంబంధించినవిషయం అయినా, దేశాన్ని చీలదీసే విభిన్నదుష్టశక్తులు, శ్రీ నెహ్రూగారన్నట్లు జాతీయతని రూపుమాపేవిగా తయారవుతున్నాయి అనటంలో ఏమాత్రం సంశయంలేదు.

మఱికొన్ని సందర్భాలలో ప్రభుత్వంవారే, అలాంటి కుల మత వర్ణ వ్యవస్థలకు దోహదంచేసేకార్యాలు కొనసాగిస్తూఉండటం మనకు ప్రత్యక్షానుభవం. లేకుంటే- విద్యార్థుల యస్. యస్. యల్.సి. రిజిస్టర్లలోనేకాక, కళాశాలలు, కొన్ని ఉద్యోగ, కార్యాలయాలు మొదలగు వాటిలోకూడా అలాంటిపద్ధతులను అవలంబించటమేకాక, "చట్టరీత్యా అది సబబయిందే; స్టేటిటిక్సు కావలసివచ్చినప్పుడు ఈకుల మత వర్ణ విభిన్నసంఘాలలో ఏ యే వర్గాని కెందరు చేరుతారో తెలుసుకోవచ్చు''నని వాదించే రాష్ట్రపాలకులు సహితం లేకపోలేదు. స్వతంత్రం పొందనప్పుడు పరాధీనులమయినమనం- చీలదీసిపాలిస్తూ స్వార్థాలు చక్కబెట్టుకొనే సంకుచిత స్వభావులయిన, పరాయివారి తత్వాలు బాగాజీర్ణించుకొని, వారితోబాటు పైతెక్కలాడేం. మనము ఆస్థితిని ప్రకృతందాటి, స్వంతంత్రం పొంది పైకివచ్చాం. కనుక 'భాయిభాయి'గా ఏక జాతీయతను పెంపొందించటానికి చేతులుకలపాలి. చేతులేకాదు; మనస్సులుకూడా. అట్టి ఐక్య భారతంయొక్క సంఘబలాన్ని ఆకళించుకొన్ననాడు లాతిజాతులు మనచిటికెనవేల్ని వంచటానికి కూడా వీలుకాదు,

వేఱొకవిషయం: మనకండ్లయెదట జరుగుతుండేనగరపాలక సభాధ్యక్షపదవి కులాల వారీగా, ఏటేట ఒక్కొక సంఘానికి సంబంధించినవ్యక్తిని వరించడం చూస్తున్నాము, ఏహైదరు కాలంలోని చట్టమో, దీనికింకా వర్తింపజేయడంవల్ల ఎన్నుకోబడ్డ కొత్తమేయరుపదవి సం॥రము పూర్తిఅయి, కాకముందే. పుటుక్కుమని ఊడటంమూలాన, నగరపాలకసభలో తీర్మానింపబడ్డ పురాభ్యుదయకార్యాలుగానీ, ప్రజాసౌకర్యసదుద్యమాలుగాని నెరవేర్చటానికి అట్టే- అవకాశాలు కలగటంలేదు. కనుక సాంఘికంగా, పౌరులు నగరపాలకులు కలిసి పరస్పర సహకారంతో ఉమ్మడిగా పనిచేయాల్నంటే, కులాలవారీగా అధ్యక్షపదవికి ఎన్నికలు జరగటాన్ని రద్దుచెయ్యాలి. మునిసిపల్ శాసనాలు మారాలి.

ఏతావాతా, తేలిందేమిటంటే, యింకా: మనవారిలో పాతవాసనలు చావలేదు. నానా-కుల మతాల హెచ్చుతగ్గులు, సేవక సేవ్యభావాలు, భాగ్యవద్దరిద్రతాభేదాలు, పాలకపాలిత దృష్టులు తొలగలేదు. ఏకజాతీయతాప్రభావం వ్యాపించలేదు. భారతదేశంలో విజ్ఞానాభివృద్ధి

అవుతున్న కొద్దీ కక్షలు మతాలుకూడా పెంపొందుతున్నాయి. ఇలాంటివి లోగడ కలికానికి సహితం కనబడని మారుమూల గ్రామాలలోను, ప్రవేశించి పీటబెట్టుకొని కూచుని లేనిపోని తగాదాలకు కారణాలుగా ఏర్పడుతున్నాయి.

రష్యా, అమెరికా, బ్రిటను దేశాలు ఏకజాతీయతాభావంతో ముందుకు ఉరకలు వేస్తూ, సమృద్ధిమంతం అయి వర్ధిల్లుతుండడం గమనించి- ఇకనైనా భారతీయులు స్వార్థబుద్ధితో, ప్రతిచిన్న విషయానికీ కీచట్లు ఆడడం మాని దేశాభ్యుదయానికి ముందంజ వేయగలరని ఆశిస్తున్నాం— "జయ్‌హింద్"

## పసిడి పలుకులు

"ఏజాతిగానీ తనంతటతానే ఒకప్రత్యేకత్వాన్ని కలిగింది కాదు. ప్రతిజాతీకూడ విశ్వ మానవ కుటుంబానికి సంబంధించిందే. — నేను నాదేశానికి స్వాతంత్ర్యం కోరుతున్నానంటే, ప్రపంచంలోని మానవజాతికి అది పూర్తిగా సేవచేయటానికే ఉపకరిస్తుందని. అవసరం అయితే, అందుకోసం ప్రాణత్యాగానికైనా సర్వసిద్ధంగా ఉండాలి." (మహాత్మగాంధి)

"ఆత్మశుద్ధి లేనివాళ్ళు జీవరాసుల నిజస్థితిని గుర్తించలేరు ఆత్మశుద్ధి అనేది లేకుండా, అహింసాసిద్ధాంతాన్ని అక్షరాలా పాటిస్తున్నాననటం పగటికలలోని ప్రలాపం. మలినాత్ములు భగవంతు డిలాంటివాడని వారిజీవితంలో గ్రహించలేరు. ఆత్మ పావనత్వమన్నప్పుడు, జీవితమందలి ప్రవర్తనలన్నిటిల్లోను పావనత్వమని భావం. ఆత్మశుద్ధి అనేది ప్రపంచప్రజాకోటికంతా కళంకసహితం అనే చెప్పాలి. పవిత్రాత్మగలవాడి పరిసరాలంతటా అపవిత్రత వ్యాపిస్తుంది." (మహాత్మగాంధి)

"ప్రపంచమైత్రి. అనురాగమే నాగమ్యం. దోషవుంజాన్ని నేనెంతఎక్కువగా ద్వేషిస్తానో, అలాగే మానవకోటిని అంతఎక్కువగా ప్రేమిస్తాను." (మహాత్మగాంధి)

# గౌరీ ప్రార్థన

### శ్రీమతి భైరవభొట్ల లీలాసీతారామ్

మంగళమో గౌరీ
మంగళమో దేవీ!

మంగళమయము నీ
మహనీయ చరితము
మదిలోన తలచెద
మముబ్రోవు గౌరీ! .... మంగళమో గౌరీ....

శంకరి! భక్తవ
శంకరి, దురితనా
శంకరి! హరియించు
సంకటములనూ! ...మంగళమో గౌరీ....

మంగళకరుడైన
మదనవైరికి నీవు
మరులు కొల్పిన దేవి
ఘుము దయ జూడుమా! ....మంగళమో గౌరీ....

కమల దళేక్షణ
విమలసద్గుణ చరిత
కరుణించి గ్రహియించు
కర్పూర హారతి .... మంగళమో గౌరీ....

కామిత ఫలదాయి
కల్యాణి సావిత్రి
కామదహనుని రాణి
కలుష సంహారిణి! ... మంగళమో గౌరీ...

పంకజలోచని!
పాప వినాశని!
భక్తరక్షణి! ఇహ
పరసౌఖ్య దాయినీ! ... మంగళ గౌరీ ....

---

# మన ప్రధాని

### సత్కవి- వైద్యవిద్వాన్– శ్రీ నారునాగనార్య

భారతజాతి విధాతృఁడు
ధీరోదాత్తుండు గాంధిదేవున కనుఁగై
చేరిన 'నెహ్రూ' పండితుఁ
డారయ జగజెట్టికాఁడె యాంధ్రులకెల్లన్ ॥

బొమిడికలేని భారతనృపుండు,సుమాస్త్రములేనిమన్మథుం,
డుమ యరమేనలేని శివుఁ, డున్నవిధుల్ దరిలేనిశ్రీదుఁ,డా
శ్రమ మొగిలేనిమౌని, మత చర్చలులేనిజగద్గురుండు, స్వా
ర్థమెఱుకలేని త్యాగి,స్వపరంబులులేని విరాగి'జహ్వారే'॥౨

ఆలోకోత్తరుఁ డొక్కఁడే భరతరాజ్యస్థాపనాచార్యపీ
ఠాలంకారమణిప్రభోపమ మహాత్మాంతేవసద్వీరశుం
డాలాగ్రేసరుఁ. డార్యధర్మవిలసన్మందార గంధోల్లసత్
వ్యాలోలావృతసర్వభౌతికజగత్ప్రాణుండు 'శ్రీజహ్వారే'॥౩

అన్యాక్రాంతదురుద్యమప్రతిహత వ్యాపారపారీణతా
మాన్య శ్రీవిజయైకసాధనధనుం, బ్రాగ్భారతాఖండతే
జోన్యక్కారవిదేశరాజ్యబలనిస్తుల్యప్రభా సంభృతా
నన్యప్రస్ఫుట ధీవిశేషరచనా ప్రాశస్త్యుఁడున్'జహ్వారే'॥౪

భరతక్ష్మాతలరాజ్య హార పతకప్రాయుండు, వైదేశికాం
తర జాతీయకళా రహస్యవిదుఁ, డాత్మప్రాజ్యరాజ్యావన
స్థిరసంకల్పపటిష్ఠనిష్ఠుఁడు, మహాంధ్రీరాష్ట్రనిర్మాణదు
ర్భరకార్యావసరప్రధాని"జవహర్లా"ల్పండితుండే సుఁడీ॥౫

జవహరులాలు చూడని విశాల జగమ్ముఁకలేదు, వ్రేలు పె
ట్టి విడని సంస్థలేదు, ప్రకటింపని ధర్మములేదు, రాజకీ
యవిషయమూహకుంబొసఁగనట్టిదిలేదు,కళారహస్యముల్
దవులనిదెప్పు లేదు. ప్రజ తన్నెదిరించుట లేదు, లేదిలన్ ౬

అతనిఁ బొగడంగ నెన్నివేలక్కఱములొ
గావలెం, బిరుదములెన్నొ కావలెఁగద!
పొగడికో లెగఁదట్టిన జగమగండు
జగమెఱింగినవానికి జందెమేల? ॥

మోతీలాల్ బుధవరునకు
నేతజ్జవహరుఁడు పొడము టెట్లన:—ముక్తా
జాతిస్థలి వజ్రోదయ
భాతిసుమీ, తార్కికప్రవాదములేలా?

# "గమ్యం లేని గమనం"

## శ్రీ పు. స. ప్రసాద్

పేరు : ఎడ్లమాటి మధుసూదన్
వయసు : ఇరవై రెండు
ఎత్తు : ఐదడుగుల ఆరంగుళాలు
తూకం : నూటఇరవై పౌన్లు
ఛాతి : ముప్పైరెండంగుళాలు

అతడి 'డైరీ' పుటలు త్రిప్పుతూన్న నాకు మొదటి పేజీలో దొరికిన వివరాలివి.

పేరు చిరపరిచితమేకాని, మనిషి గుర్తుపట్టలేనంతగా మారిపోయాడు.

ఎడ్లమాటి మధుసూదన్ ........వై. మధుసూదన్... .......... ఆలోచనల అలల్లో మున్కలేస్తూ గతాల అగాధాల్లోకి తొంగి చూశా.... మనసులోనే...

* ♦ *

అవును.......

మధు బి. ఏ. లో నా క్లాసుమేటు, ఏ మగవాడితో మాట్లాడితే ఏమనుకొని పోతారో అన్నే బిడియం, భయం వెనక్కు లాగుతున్నా, మధు అమాయకతని చూసి, అతణ్ణొకసారి పలుకరించాను!

"ఏమండీ! కథారచయిత "మధు" మీరేనంటారు! నిజమేనా?" ప్రెస్ రిపోర్టర్ ప్రశ్నలాగుందనుకుంటూనే అడిగా అతన్ని—

"ఆ సందేహ మెందుకొచ్చింది ? ఇంతకూ నేనేనంటే ఏ చిక్కు తెచ్చిపెట్టరుగద!" మధు సమాధానం.

ఇంకేం మాట్లాడాలో తెలియక తికమకపడి వెనక్కి తిరిగి వెళ్ళిపోయా।

* * *

లేడీస్ వెయిటింగురూము ప్రక్కనుంచి వెళ్తున్న మధుని చూపిస్తూ గాయత్రి—

"వీడే నామీద కథ రాసింది, కాలేజీలో మొగరాయుళ్ళా తిరుగుతానట! ఇంకా ఏవేవో రాశాడు" అంది.

ఇదో తెగులు - ఎవరైనా కథారచయిత ఓ కథ వ్రాస్తే చదివి పూర్తికాక, అందులో కధానాయిక పేరు -ఏ సావిత్రో స్వయంప్రభో, అయితే, అది తనపేరే అయితే, నామీదే ఆ కథ వ్రాశాడంటూ వాపోవడం—

ఒక్క ముక్కలో చెప్పాలంటే "గుమ్మడికాయల దొంగా అంటే భుజాలు తడుముకోవటం." వెంటనే నేను మధు తరఫున వకల్తా పుచ్చుగుని - "గుమ్మడికాయల దొంగా అంటే భుజాలు తడుముకున్నట్లు అతడి కథానాయికకి గాయత్రి అని పేరు పెడితే నీవే అని ఎందు కనుకోవాలి?" అన్నా—

"అయ్యోపాపం! వెనకేసుకొచ్చావ్ గాని, స్పోర్ట్స్ డే నాడు బ్యాడ్మింటన్ ఆడుతూ కాలు జారిపడ్డది నేను గాదేమిటి? అతడి కథలోనూ అదే సంఘటన వర్ణించాడు గదా!" గాయత్రి నావాదనని త్రుంచేసింది.

ఇలా సంఘటల్ని కూడా తమతో అతుక్కుంటూంటే ఇంకేం చెప్పను.? వాదించి లాభంలేదని మెదలక వూరుకున్నా!

♦ ♦ *

స్వయంప్రభ కాలేజీలోనే థర్డ్ యియర్ చదువుతూంది. మాకంటె ఒకేడు జూనియర్! ఓరోజున నా ఎకనామిక్స్ నోట్సు తీసికొంద రాసుకోవడానికి! తిరిగి మూడోరోజుని తెచ్చి ఇచ్చేసింది! నేనింటికిపోయి నోట్సుతీసి చూద్దునుగదా! ఒక లేఖ—

డియర్ ప్రభా,

నీవు రాసిన లేఖ అందింది. కాని నా కిలాటి ప్రేమల మీద వెర్రిమొర్రి నమ్మకాలు లేవు! నాలోని ఏ ఆకర్షణ చూసి నన్ను మోహించావోగాని, నామీద నాకు సదభిప్రాయం లేదు. పైగా నేను పెద్ద ధనాఢ్యుణ్ణికాను! నాలాటి మరీచికలమీద మరులు వదలుకోవడం మంచిది. ఆపైన నీలో ఏ ఆకర్షణా నాకు గోచరం కాలేదు. ఉంటా, సెలవు.

నీహితైషి
మధు.

లేఖను చదివాక నిట్టూర్పువిడిచి మళ్ళీ మడిచి, మర్నాడు కాలేజీలో స్వయంప్రభ ఏకాంతంగా ఉన్నప్పుడు భద్రంగా అందజేశా!

ఆమె మొదట్లో కొంచెం సిగ్గుపడ్డా తన గోడంతా నాతో వెళ్లబోసుకుని బావురుమంది.

అతడు అందగాడూ, కవి! (ఈ) రెండూ ఆమెని ఆకర్షించాయట! కాని అతడామెను తిరస్కరించాడు.

ఇది జరిగిన కొన్నాళ్ళకామె కాలేజీ మానుకుంది! తర్వాత ఆమె ఏమయిందో? అయినా మనకేం పని?

* * *

గాయత్రి ఓరోజున వాళ్ళింటికి నన్ను రమ్మని ఆహ్వానించింది; మాట తీసేయలేక వెళ్ళాను. ఓ ఉత్తరాల దస్త్రం నా ఎదట పారేసింది! చూడమంటూ.

చిత్రం— అన్నీ ప్రేమలేఖల ట్రూకాపీలు! నాయకుడెవరో కాదు—మధు! అయితే ఒక్కదానికి సమాధానం రాలేదని చెప్పింది దిగులుగా గాయత్రి. ఇన్ని ఖబుర్లూ చెప్పిన గాయత్రికికూడా ఎట్లా కలిగిందో "మధు" మీద మోజు?

కాని, నన్ను నేను తరచిచూసుకుంటే నాలోమాత్రం మధుమీద అట్లాంటి మమతలేదూ?

బహుశా తెగించి బయటపడితే నాగతికూడా ఇంతే కామోసు! కాని నాలోని పిరికితనం, నాహృదయం మధు ఎదుట విప్పిచెప్పడానికి అవకాశమియ్యలేదు.

తర్వాత పరీక్షలవడం నేనూ మధూ బి. ఎ. ప్యాసవడం, అతను ఎమ్. ఎ. కు నాగపూరు వెళ్లడం అన్నీ సినిమాలోని సంఘటనల్లా కడువేగంగా జరిగిపోయాయి. తర్వాత అమ్మా నాన్నా నాకు పెళ్ళిప్రయత్నాలు చేశారు.

కాని— కాని గతాన్ని విస్మరించి నాహృదయఫలకం మీది మధుచిత్రాన్ని చెరిపెయ్యలేక ఆమధురస్మృతులతోనే జీవితంగడుపుతున్నా కాలేజీలో ట్యూటరుగాచేరి!

♦ * ♦

ఆనాటికీనాడు—

మళ్ళీ మధు ఎదరపడ్డాడు!

బహుశా నన్ను గుర్తించివుండడు: కాలేజీలో చదివేప్పుడు సన్నగా రివటలా వుండేనేను కొంచెం బొద్దుగా తయారవటం, వయసుతోపాటు శరీరంలోని నవనవలూ, నిగనిగలూ మాయమవటం కారణమేమో బహుశా!

♦ ♦ ♦ ♦

ఆలోచిస్తూనే డైరీలో మరోకొన్నిపుటలు తిరగేశా, అప్రయత్నంగానే!

ఒకపేజీలో ఒకఫొటో అంటించివుంది! క్రింద చాలా రాసివుంది.

ఆమె.......ఆమెపేరు తెలీదు. అమె మహరాష్ట్రి యువతి, యూనివర్సిటీలో ఎమ్.ఎస్సి. చదువుతూంది. ఆడవాళ్ళంటే చిన్నతనంనుంచీ ఏహ్యాభావం అలవర్చుకున్ననేను (కారణం నేటికీ నాకు తెలియదు.) ఆమెను చూడటంతోనే మంత్రముగ్ధుణ్ణయ్యాను.

ఇదివరకెందరో సుందరులు నాపొందుకోరి నాచే తిరస్కరింపబడ్డారు! బహుశా నాలో ఏదో ఆకర్షణ చూసి కాబోలు! స్వయంప్రభ, లలిత, గాయత్రి, లత, ముంతాజ్. లిల్లీ, అబ్బా! కొందరిపేర్లుగూడా గవనానికి రావటంలేదు. కాని ఈమె! ఎన్నాళ్ళో నాదరికి రాకపోతుందా అనే అహంతో ఎదురుచూచా! కాని లాభం లేకపోయింది! ఒకసారి, మరోమహారాష్ట్రమిత్రుని సాయంతో ఆమె పరిచయం సంపాదించుకున్నా. ఆమె పేరు 'యామిని' ట! ఆమూడక్షరాల్లోనే నాకెంతో మాధుర్యం, ప్రపంచసారస్వతంలోని సర్వస్వం ఇమిడి వున్నట్లు తోచింది!

ఆమెకూడా నాతో చాలాచనువుగా మాట్లాడేది! నాకథల్ని ఆంగ్లంలోకి అనువదించి ఆమెకిచ్చేవాణ్ణి! ఆమె వాటిని ఎంతోమెచ్చుకునేది! మేమిద్దరం షికార్లూ, సినిమాలూ అన్నీ జంటగా పోయేవాళ్లం. కాని! ధైర్యంచేసి నాఅంతరాంతరాల్లో భద్రంగా దాచుకున్న రహస్యాన్ని బయటపెట్టినప్పుడు—

"నన్ను నువ్వు అర్థం చేసుకున్నదింతేనా? చనువుగా ప్రవర్తించిన స్త్రీలగురించి నువ్విట్లానే భావిస్తావన్నమాట. నీలో ఈనీచభావం అసలెందుకు కలిగినట్లు? రచయితవయినందుకు మనసుల మారుమూలలలోని భావాల్ని కూడా అర్థంచేసుకునే జ్ఞానం ఉండిఉంటుందనుకున్నా! ఇంకిక్కణ్ణుంచీ నీతో చనువుగా వుండటం మంచిదికాదని ముందే హెచ్చరించావు! థాంక్స్! ఇదే మనిద్దరిస్నేహానికి స్వస్తి!" అని రెండుచేతులూ జోడించి నమస్కరించి, గిరుక్కున తిరిగి వెళ్ళిపోయింది!

చెప్పుతో మొహంమీద కొట్టినట్లయింది. తిరిగి కాలేజీలో రెండుమూడుసార్లు పలకరించినా పలకలేదు. ఒంటరిగా చూసి క్షమాపణ చెప్పుకుందామని ప్రయత్నించాను. కాని నన్నుచూసి ముఖంచాటుచేసికొనేది!

దాంతో నాకు మనస్థైర్యంలేక, చిక్కి శల్యమై నాగపూరుచదువు అర్థమధ్యాంతరం చేసి వచ్చేశా.

ఆనాటినుంచే ఈ నా అర్థరహితసంచారానికి నాంది! గమ్యంలేని గవేషణ! నాకే తెలియని, దేన్నిగురించో ఈ అన్వేషణ!

# "గమ్యం లేని గమనం"

ఎంతగా మారాడు మధు! పాపం! జీవితంలో ఎం దర్నో నిరాశాతిమిరంలో తోసేసి తానుగూడా అగహ్వ రంలోనే పడ్డాడు.

అంతలో లేవెట్రీ తెరచుకొని మధు బయటకు వచ్చాడు.

దగ్గరికి వచ్చాక అడిగా!

"మధూ! గుర్తుపట్టావా నన్ను?"

కళ్లు చికిలించి చూశాడు.

"ఎవరూ? అ.... ఓ లతకదూ?"

"అవునుమధూ! నీవులేకుండా నీడైరీ చూసినందుకు క్షమించు! నీ విషయం తెలుసుకొన్నాను. ఎందుకీఅర్థం లేని తిరుగుడు మధూ! ఎవర్నో వివాహంచేసికొని జీవి తంలో ఒడిదుడుకులు లేకుండా స్థిరపడరాదూ?"

"ఎందుకులతా? ఆమె ఏనాటికైనా నాదే అవుతుందన్న ధృఢనిశ్చయం నాకుంది. వెనక నీకోసారి ఆశావాదికి నిరాశావాదికి భేదంగూర్చి చెప్పాను గుర్తుందా."

అవును— మధుతో పరిచయమైన తొలిరోజుల్లోనే ఓసారి— కాలేజీలో.

"మధూ! కథారచయితవుగదా! ఒక చిన్నసందేహం తీర్చగలవా?"

"ఏమిటి?

ఆశావాదికి, నిరాశావాదికీ, చిన్నఉపమానంతో, వారి మధ్యగలభేదం చెప్పగలవా?"

"గ్లాసు సగానికి పాలుపోసి, ఆశావాదిచేతి కిస్తామనుకో." ఈగ్లాసుసగంనిండుకు పాలున్నాయి."

అంటాడు ఆశావాది, అదే నిరాశావాదిచేతి కిస్తే "ఈ గ్లాసు సగం ఖాళీగా వుందంటాడు" ఈ ఉదాహరణ చాలనుకుంటా ఆశావాదికీ, నిరాశావాదికీ భేదం తెలియ జెయ్యడానికి" మధుసమాధానమిది—

అయితే మధూ! ఒకమాటడగుతాను! ఆనాడు ధైర్యంచేసి నీఎదట తెగించి అడగలేకపోయా, గాని నన్ను నీవు ప్రేమించి నీదాన్ని చేసికోలేవా?" ఎంతో దీనంగానే అడిగాను.

ఏధైర్యంతో ఈమాటలన్నానో నాకే తెలీదు!

"క్షమించులతా! ఆమెనుమరువలేను! ఇంకెవరి ముఖద్యుతుల్లోనూ ఆమెముఖంలోని దీధీతుల్ని చూడ లేను!

అనుకున్నట్టే అయింది! మారాడకున్న మధు నన్ను కూడా తృణీకరించాడు! తర్వాత అతడు మౌనం వహించాడు. నేనూ మూఖావంగానే కూర్చుండిపోయా. దిగాల్సినస్టేషన్ ఇంకెంతదూరముందో గుణించుకుంటూ!

జీవితంలో తారసిల్లిన సుందరుల సంఖ్యకి ఇంకొకటి కలిపి గుణించుకుంటున్నట్లున్నాడు మధు! కళ్ళుమూసు కుని ఏవో ఆలోచనల్తో రెక్కలుగట్టుకు విహరిస్తున్నాడు!

దిగాల్సినస్టేషను వచ్చేసింది!

"వెళ్ళొస్తా మధూ! ఎప్పటికైనా, నా ఈహృదయంలో నీకు స్థానముంది! ఇది నీఆస్థి! మనసుమార్చుకుంటే నన్ను వెతుక్కుంటూరా! నీ ఆస్థిని స్వాధీనం చేసుకోవ డానికి నీ కొక్కడికేవుంది హక్కు!"

మధు తిరిగి ఒక్కముక్కగూడా మాట్లాడలేదు!

మౌనంగా రైలుదిగి వచ్చేశాను!

మధు ఏనాటికైనా నావాడౌతాడనే ఆశ ఇంకా నన్ను పీడిస్తోంది! ఔను. నేను ఆశావాదిని! మధుకూడా ఆశా వాదే కావొచ్చు! ఇద్దరిలో ఎవరో ఒకరం కడకు విస్ఫుల్ల హ చెందొచ్చు! ఒకరినిరాశే మరొకరిజీవితంలో ఆశా జ్యోత్స్నల్ని వెదజల్లుతుందనీ తెలుసు! మధుచెప్పిన ఉపమానం మనసులో మెదుల్తోంది! కనుకనే ఈఆశనిరా శల సరిహద్దు అంచులనే జీవితవలయాల్ని సృష్టించు కుంటున్నా, గమ్యంలేని గమనం సాగిస్తూ!

---

"ఉత్తమజాతి నిర్మాణమునకు ఉత్తమవ్యక్తులను సృష్టించు టొక్కటే మార్గం"

"విశ్వసనీయుడుగ ఉండవలెనను వ్యక్తి సక్రమ ప్రవర్తనము గలిగి యుండవలెను."

(శ్రీ విశ్వేశ్వరయ్య)

# పూర్తి చిరునామా-
# త్వరగా
# బట్వాడా

మీ వుత్తరాలలో అతి ముఖ్య భాగంగా మేము పరిగణించే చిరునామాను మీరు సంక్షిప్తంగా వ్రాసి వూరుకోనడంవల్ల, మేము ఏమీ తోచక అవస్థలో పడుతూ వుంటాము. చిరునామాను విపులంగా వ్రాయకపోవడంవల్ల మీ వుత్తరాలు "చాలా చాలా" దూరం వెళ్ళిపోతాయి!

*మీ వుత్తరాలు నేరుగా గమ్యస్థానం చేరాలంటే చిరునామాను పూర్తిగాను, స్పష్టంగాను వ్రాయాలి.*



**మాకు ఇతోధికంగా సేవచేయడానికి**
**మాతో సహకరించండి**



తంతి - తపాలా శాఖ

DA 60/397

# ప్రశాంతంగా ఉండండి

“శాంతములేక సౌఖ్యములేదు” అన్నారు పెద్దలు. కాగా ఆధునిక జీవితంలో ఐహికజీవితానికి గల ప్రాధాన్యం ఆముష్మిక జీవితానికి లేకపోవడం చేతనూ, విజ్ఞానాభివృద్ధి దినదిన ప్రవర్ధమానం కావడం చేతనూ, మానసిక శాంతిమాట అటుంచి, రొద, గొడవ, గోల లేకుండా ప్రశాంతగా జీవించడమే కష్టమైపోతుంది. పారిశ్రామికాభివృద్ధి, సాంకేతిక జ్ఞానావృద్ధి ఫలితంగా ప్రపంచంలో కర్కశధ్వనులు, గొడవ, గోల, విపరీతంగా ఎక్కువఅయాయి. వాటిని తగ్గించడానికి అంతర్జాతీయచర్య అవసరమని, లోగడ జ్యూరిచ్‌నగరంలో, ఆలక్ష్యసాధనకై జరిగిన ప్రథమ అంతర్జాతీయ మహాసభవారు నిర్ణయించారు. ప్రపంచంలో దుర్భరంగా పెరిగిపోతున్న యీ ధ్వనులు తగ్గించడానికి ఏర్పడిన యీమహాసభలో పదమూడు దేశాలు పాల్గొన్నాయి.

ఆధునిక జీవితంలో యంత్రాలవల్ల ఎక్కువ ధ్వని ఉత్పన్నమవుతున్నమాట నిజమే కాని, వాటిని దుర్వినియోగపర్చి, యిరుగు పొరుగువారికి యిబ్బంది కల్గించడంలో మానవునికి గల బాధ్యత కూడా గుర్తించక తప్పదు. మోటారుసైకిల్ గలవారు తమ సైకిల్ చేయగల్గినంత ధ్వని చేయించడం, రేడియోగలవారు తమ రేడియోలని పూర్తివాల్యూములో పెట్టడం దీనికి ఉదాహరణలు. మానవులు యీ సందర్భంలో అనుసరించతగిన సూచనలు ఎన్నో జ్యూరిచ్ సభవారు సూచించారు.

## మన స్వంత ధ్వనులు మనకెంతో ఆనందం

యూరప్‌లో ధ్వని నిరోధానికి కృషి చేస్తున్న ప్రముఖులలో డాక్టర్ మండ్‌లోవున్న మాక్సుప్లాంక్ పరిషత్తు నాయకుడయిన ప్రొఫెసర్ లెహమాన్ ఒకరు. ప్రపంచంలో ధ్వనితగ్గించడానికి ఏర్పడిన అంతర్జాతీయ సంఘానికి డాక్టర్ లెహమాన్ అధ్యక్షులు, ఈయన ప్రపంచంలో ధ్వనుల గురించీ, వాటికి మానవజీవితంపై గల ప్రభావంగురించీ, చక్కని పరిశోధనలు జరిపారు. ధ్వని పరిమాణముకు తెల్సుకోడానికి “ఫోను” ఒకఅంశగా తీసుకుంటే, నలభయి ‘ఫోనుల’ ధ్వని మనకి చాలా కర్కశంగానూ, బాధగానూ ఉంటుంది, అంతకన్న తక్కువ ఉధృతంగల ధ్వనులుకూడా మన మనస్తత్వ పరిస్థితుల ననుసరించీ, యిష్టాయిష్టాల ననుసరించీ, ముఖ్యంగా రాత్రి వేళలలో మనకి యిబ్బంది కల్గచేస్తాయి. ప్రొఫెసర్ లెహమాన్, మనుష్యులలో ధ్వని చరించగల శక్తిలో చాలా వ్యత్యాసాలు ఉంటాయనీ, అంతేకాక ఆధ్వని యెడ వ్యక్తులకి గల యిష్టా యిష్టాలమీద వాటి ఫలితాలు ఆధారపడి. ఉంటాయనీ. వివరించాడు. మనకి నచ్చిన ధ్వనులు ఎంత ఉధృతంగా ఉన్నా, బాధకరంగా కనపడవు. నూతన దంపతులకి తమ శిశువు రోదన అల్లరి ఎంతో ఆనందంగా కనపడుతుంది. ఇరుగు పొరుగువారికి అదే ఎంతో బాధగా ఉంటుంది. కొత్తగా మోటారు కొన్న ఆసామి సంగతీ అంతే, అలాగే ఒక కొత్తయంత్రం తయారుచేసే వ్యక్తికీ, తమకి నచ్చిన కార్యక్రమాలకి “లౌడ్‌స్పీకర్లు” వాడేవారికీ, దానిగొడవ, గోల తగ్గించమంటే ఆగ్రహం రావడం సహజం. చాలామంది ప్రజలకి తమ ఆధిక్యత, ప్రాధాన్యం, తాముచేయగల ధ్వనిపై ఆధారపడి ఉంటుందనే భావంకూడా లేకపోలేదు,

## రక్తప్రసారంపై ధ్వని ప్రభావం

మెలుకువగా ఉన్న సమయంలో 65 ఫోనులు. నిద్రావస్థలో 45 ఫోనులకన్న ఎక్కువ ఉధృతంవున్న ధ్వనులు మనరక్తప్రసారంపై దెబ్బతీస్తాయి. ప్రొఫెసర్ లెహమాన్ సిద్ధాంతంప్రకారం గుండెనుంచి మంచి రక్తంతీసుకువచ్చే రక్తనాళాలు, ముఖ్యంగా చర్మంక్రింద ఉన్నవి, సన్నపడిపోతాయనీ, దానివల్ల మంచి రక్తం యొక్క ప్రసారం చాలా వరకు తగ్గిపోతుందనీ, తెలుస్తోంది, రక్తనాళాలపై యీ ప్రభావం కల్గడానికి ధ్వని తరచుగా వినవల్సిన అవసరం లేదు. వయస్సుమీరిన వారిపై ఉన్నంత ప్రభావం చిన్నవారిపై ఉండకపోవచ్చు. ధ్వని ఉన్నంత సేపూ దాని ప్రభావం రక్తనాళాలపై ఉండి, ఆ తర్వాత క్రమంగా తగ్గుతుంది. ధ్వనికి మనం అలవాటుపడినా కూడా, రక్తనాళాలపై ధ్వని ప్రభావం మనకి తెలియకుండానే ఉంటుంది.

ప్రొఫెసర్ లెహమాన్‌తో కలిసి, పరిశోధనలు సాగిస్తున్న డాక్టర్ జాన్‌సెన్ అత్యధికంగా ధ్వని ఉత్పన్నమయ్యే ఉక్కు కర్మాగాలలో పనిచేసేవారిపై ధ్వని ప్రభావం గురించి తన పరిశోధనలో లోగడ పూర్తిచేశాడు. ఎక్కువ ధ్వనికి గురిఅయే కార్మికులలో చర్మానికి సంబంధించిన రక్తప్రసారంలో

నిరోధం, హృదయ స్పందనంలో క్రమగతి లేకపోవడం, అజీర్ణం, కల్గుతాయని సూచించాడు. కొంత కాలం నిరంతరంగా యీప్రభావానికి గురిఅయినచో అవి వ్యాధులక్రింద తయారవుతాయి. మిల్లులలో ధ్వని ఎక్కువగా ఉండేచోట్ల పనిచేసేవారు సాధారణంగా బలమయినవారు. అయినా వీరు పనిచేసే చోట్లలోనూ, వారి కుటుంబాలలోనూ కూడా, ధ్వని తక్కువవుండే ఫేక్టరీలలో పనిచేసేవారితో పోల్చిచూస్తే, సంఘర్షణలు తగాదాలు ఎక్కువ కనపడతాయి.

## అతితీవ్రమైన ధ్వనులు

రెండవ తరగతి ధ్వనులు 65 మొదలు 90 ఫోనుల వరకూ ఉన్నవి. వీటివల్ల శ్రవణేంద్రియాలు దెబ్బ తింటాయి. మొదట కొంతకాలంవరకూ చెవులు పని మానివేసి ధ్వని తగ్గిన తర్వాత కొంత సేపటికి తిరిగి పని చేస్తాయి. కాని అటువంటి ధ్వనులని చాలా కాలం విన్నచో పూర్తిగా చెముడువస్తుంది. దీనిలో కూడా వ్యక్తికీ వ్యక్తికీ తేడా వుండవచ్చు. కాని జర్మన్ ఇంజనీర్ల సంఘం, 90 ఫోనులవరకూ ధ్వని ప్రమాదంకాదని అభిప్రాయపడుతున్నారు. పారిశ్రామిక సంస్థలలో కొన్నిచోట్ల అక్కడక్కడ ధ్వని నూటఇరవయి ఫోనుల వరకూ ఉత్పన్నమవుతుంది. కొన్ని కొన్ని చోట్ల ఉదాహరణకి. జెట్, రాకెట్, యంత్రాలు పరీక్షించే సమయాలలో ధ్వని పరిమితి, 150 ఫోనుల వరకూ ఉత్పన్నమవుతుంది, అంతేకాకుండా అటువంటి సమయాలలో "అల్ట్రాసానిక్" తరంగాలు కూడా ఉత్పన్నమవుతాయి. ఆధ్వనులు నరాలకి తీవ్రమైన ప్రమాదం కల్గచేస్తాయి. ఒక్కొక్కప్పుడు పక్షవాతంగాని, సత్వరమరణంగాని తటస్థించవచ్చు. అందుచేత ప్రశాంతంగా, నిశ్శబ్దంగా వుండడానికి ప్రజలు పాటుపడవల్సిన అవసరం ఎంతైనా ఉంది.

జ్యూరిచ్ విశ్వవిద్యాలయపు న్యాయశాస్త్ర నిపుణుడు ధ్వని తగ్గించడానికి ప్రభుత్వాలు తగు శాసన చర్యలు తీసుకోవాలనీ, ప్రస్తుతం అమలులో ఉన్న నిబంధనలని పోలీసు గట్టిగా అమలుపర్చాలనీ సూచించాడు. ప్రొఫెసర్ ఆటింజర్, ప్రభుత్వాలు తీసుకోతగిన శాసనచర్యలనీ, అధికార చర్యలనీ సవివరంగా సూచిస్తూ ప్రతీపెద్ద ప్రాంతంలోనూ ధ్వని నిరోధించడానికి పెద్దతరహా ఉద్యోగులని నియమించాలని సూచించాడు. అయినా ఎవరిగోల వారికి ఆనందమవడంచేత ఆపని అంత సులభసాధ్యం కాకపోవడం కూడా నిజమే.

(ఇంట్రా) ★

## పసిడి పలుకులు

మనము తొలుదొల్త విన్నంతమాత్రాన మనకు అసంఖ్యాకులయిన దేవతలు కనబడుటచే దిగ్భ్రమచెందుదుము. కాని వారందఱు ఆకారచేష్టాదికాలచే వెవ్వేఱుగా కనిపించు ఆ ఒక్కడైవమే అని నిశితవివేచనచే తెలిసికొందుము. కాని చేతనత్వంగల సగుణుడైన తన్ను మానవు లూహించుమార్గాన్ని తిర్కరించునట్టి పరిపూర్ణుడు,- సర్వశక్తిసంపన్నుడు:- సర్వజ్ఞుడు అగు భగవంతుడొక్కడే అన్నిట గోచరించును. ఈ సిద్ధాంతమే హిందూమతమును ప్రపంచంలోని సర్వమతములను సహించు మహచ్ఛక్తి గలదానినిగా చేయుచున్నది. ఏలయన సర్వోత్కృష్టుడైన ఆయేకేశ్వరునియందే కల్పితదేవతామూర్తులన్నియు లీనమైయున్నవి. (జార్జిబెర్నార్డుషా.)

సత్సాంగత్యము దుష్టులకు సద్గుణముల నలవఱచును. కాని; దుస్సాంగత్యము సద్గుణులకు దుర్గుణములు అలవఱింపఁజేయవు. నేలపై బడిన గులాబి నేలవాసనను గ్రహింపదు. కాని ఆపుష్పము తన పరిమళమును నేలకు ఇచ్చును. (ఆర్యోక్తి)

దుర్దశను అనుభవించినతరువాత మంచిదశకు•వచ్చుటయే ఆనందదాయకం. (ఆర్యోక్తి)

# ఏర్చికూర్చిన ముత్యాలు

## I

## సంఘ సంక్షేమ కార్యాల్లో ప్రజల సహకారం.

శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్‌గారు

(స్ోషియల్ వెల్ ఫేరు, వార్షికసంచికలో) (ఆంగ్లంలో వ్రాసిన వ్యాసాని కనువాదం)

---



జాతీయప్రణాళికానిర్వహణం దృష్టిలో పెట్టుకొని దానికి ప్రజాసహకారం అత్యంతావశ్యకంగా ఉండాల్నని గుర్తించడంమీదే. దానికి సంబంధించిన పథకాలన్నీ జయప్రదంగా కొనసాగగలదని, అభిజ్ఞులందరూ నొక్కిచెబుతున్నారు. ఈవిషయంలో ప్రజల్లోకూడా ఉత్సాహం రేకెత్తింది. వారు అలాటి పథకాలలో పాల్గొనటంవల్ల — ఇదివరకెంతోపని జరిగింది. ప్రభుత్వమున్న క్రమచట్టముల రక్షణలకంటె, ఇంచుమించు కొంచెం ఎక్కువగా జోక్యం కలుగజేసికొన్నప్పుడు. (అనగా ఒక శతాబ్దానికి పైగా) మనదేశంలో సంఘ సంక్షేమ కార్యకలాపాలను ప్రజలే స్వయంగా- స్వచ్ఛందంగా- ముందుకువచ్చి నిర్వహిస్తున్నారు. ప్రజానీకంలో పెక్కుమంది పట్టుదల వహించి స్వంతబాధ్యతతో ఇలాటిసేవకు దారిచూపారు. వాళ్ళు ఇకమీదటకూడ అట్లుచేయటానికి సంసిద్ధులే.

ఇప్పటికి ఏడేండ్లుగా పనిచేస్తున్న కేంద్రసంక్షేమ సంస్థ, నూర్లకొలదిసేవాసక్తలయిన స్త్రీలకు- అన్ని రంగాల్లో పనిచేయటానికి తర్ఫీదుఇచ్చింది. కార్యకర్తల సహాయంతో నడుస్తూవుండే 6000 సంఘాలకు ప్రభుత్వం ఆర్థికసహాయం చేసింది. ఆమోస్తరే గ్రామాలలోని 3000 సంక్షేమసమితులకుకూడా ద్రవ్యరూపంగా తోడ్పడింది. అలాటి గ్రామసంఘాలకార్యాలు సక్రమంగా పరిశీలించటానికి రాష్ట్రసంక్షేమసంఘఉద్యోగులు 12 గురుకూడ ఉన్నారు. వారు శ్రద్ధతో గ్రామాలలోని సమితులను నడుపుతున్నారు. అంతేకాదు; గ్రామీణులందరూ ఒక పద్ధతికి కట్టుబడి అన్యోన్యమైత్రితో ఏకోన్ముఖంగా, పని చేసేట్టు చూస్తారు. కార్యనిర్వహణంలో గ్రామప్రజానీకం చూపే సమర్థత శ్రద్ధ- మొదలయినవాటివల్ల వారు తమ బాధ్యతను ప్రస్ఫుటంచేస్తున్నారు. ఇదే కేంద్రసంఘ సంక్షేమసంస్థ సాధింపగలిగిన గొప్పవిజయం. దిక్కులేని అనాథస్త్రీశిశువుల విషయంలో శ్రద్ధవహించటానికి తగినతరిబీతు ప్రత్యేకంగా వందలకొలదిస్త్రీలు పొందటానికి సాధ్యమయ్యేటట్లు కేంద్రసంఘం సౌకర్యాలు కలిగిస్తున్నది. కష్టజీవులకొరకు క్రొత్తనౌకరీలు కల్పించి ప్రజాసేవ చేయటానికి అవకాశమిస్తున్నది. పనిఉన్నా, లేకున్నా, బాలికలు సమర్థురాండ్రుగాఉంటే, శిశున్యాయాధికారిణులు, డాక్టర్లు, విద్యాబోధకురాండ్రు మొదలైనవాళ్లగా, అయి స్వంతబాధ్యతతో సిద్ధపరచుకొన్న కార్యక్రమపట్టికలను అనుసరించి, తమకార్య సందర్భాలమీద విఘావుంచి పనులు నెరవేర్చేటట్లు సంఘం గమనిస్తూ ఉంటుంది. స్వచ్ఛందంగా సంక్షేమకార్యాలలో పాల్గొనేటట్లు ప్రోత్సాహపరచబడిన మహిళాసేవికల సహకారాన్ని కేంద్రసంక్షేమసంఘం సాధించగలిగింది.

కాని సర్వసామాన్యంగా అందరిఆవశ్యకతలు గుర్తించటం, ఉపయోగకరాలయిన పలువిధ శాఖలవంకకు తమ శక్తిసామర్థ్యాలు ఉన్ముఖాలయ్యేటట్టు నడపటం కొందరిలో కొరవడినట్లు తోస్తుంది. ప్రభుత్వం సంక్షేమప్రణాళికాకార్యాలు నెరవేర్చటానికి ప్రాతినిధ్యంవహించిన అనేకసంస్థలకి సహాయంచేయటంలో పాల్గొంటున్నది. కాని, ప్రభుత్వం తలపెట్టిన సంక్షేమకార్యాలు నిర్వహింపగల సంస్థలలో పెక్కింటికి ప్రణాళికాకార్యక్రమాన్నిగూర్చి చాలినంత వివరాలు దొరకటంలేదు. అనేకసంస్థలు తామేర్పరచుకొన్న పథకాలను అనుసరించి సంక్షేమప్రణాళికా కార్యాలను నెరవేరుస్తున్నాయి. కాని తగినసాధనసామగ్రి సంతరించలేకపోతున్నాయి. ప్రభుత్వప్రణాళికాంశాలకు, తమపథకా లెంతసన్నిహితం కలిగి

వుందో వాళ్ళకి తెలియదు. అందుచేత ప్రభుత్వసహాయాన్ని పొందటానికి వాళ్ళు ఏమార్గంతో ప్రణాళికను నిర్వహించాలో ఎరగరు. దీనిఫలితంగా, ప్రభుత్వప్రణాళికలోని కార్యాలవ్యయం చాలినంత ఆధిక్యాన్ని, లోపాభూయిష్ఠాన్ని చూపుతున్నాయి. పైగా, స్వచ్ఛందంగా పనిచేసే సంస్థలు అనేకం ఆశాభంగం పొందుతున్నాయి.

కనుక నిర్ణీతంఅయిన పథకాలనుగురించి బాహాటమయినతెలివిడి నిచ్చే తర్ఫీతు ముఖ్యంగా ప్రచారం కావాలి. కేంద్ర రాష్ట్రప్రభుత్వాలవలన ఆ సంస్థలు ఆర్థికరూపంగాను, సాధనరూపంగాను కోరే యావత్సహాయం తెలియాలి. అందుకు తగిన మార్గాలుకూడా అన్వేషించాలి. అనేకపథకాలూ ప్రణాళికాకార్యాలు 60 శాతం నుండి 75 శాతం వరకు కేంద్రభుత్వంనుండి సహాయం పొందుతున్నవి. మిగిలిన 40 శాతంనుండి 25 శాతం వరకు రాష్ట్రప్రభుత్వాలమంచే తప్పక వస్తుందనే నమ్మకంలేదు. ప్రణాళికాకార్యాలు నెరవేర్చటానికి ప్రాతినిధ్యంవహించిన సంస్థలు, తమకుతాముగాగాని, లేదా రాష్ట్రాలకు కేటాయించినమొత్తంలో కొంతభాగం వచ్చేట్టుగాగాని ప్రయత్నంచేసి సహాయం పొందడం యుక్తం. సాధారణంగా కేంద్రరాష్ట్రప్రభుత్వాలమధ్యనే ఉత్తరప్రత్యుత్తరాలు నడవటంచేత, ఏపథకమయినా తన స్వంతఅజమాయిషీక్రిందే రాష్ట్రప్రభుత్వం జరపటానికి శ్రద్ధవహిస్తుంది. అయితే, తనమూలధనంలోనుంచి 40 శాతం మొత్తం ఏరాష్ట్రప్రభుత్వం అయినా సంక్షేమకార్యాలకు వెచ్చపెట్టటం అంత అవసరంకాదని ఎంచినప్పుడు, సంక్షేమప్రణాళికకే స్వస్తిచెప్పాల్సినస్థితి యేర్పడుతుంది. స్వచ్ఛందంగా పనిచేసే పెక్కుసంస్థలు సంక్షేమకార్యకలాపాలను నెరవేర్చేవిషయంలో సమర్థత చూపించటమేకాక, వాటికయ్యే ఖర్చులు పూర్తిగాగాని, అందొకభాగంగాని సేకరిస్తున్నారు. కాని అట్టిసంస్థలనుగూర్చి రాష్ట్రప్రభుత్వాలు సాధారణంగా ప్రచారం చేయటంలేదు,

కనుక దీనివిషయంలో మిక్కిలిశ్రద్ధ వహించాలి. అలాచేస్తే రాష్ట్రప్రభుత్వాలు పూర్తిగా ప్రణాళికాంశాలు సార్థకమయ్యేట్లు చేయగలవు. స్వచ్ఛందంగా ప్రజాసహాయాన్ని పొందే ప్రయత్నమూ చేయగలవు. క్రమంగా అలాచేసేకొద్ది, స్వచ్ఛందంగా ఏర్పడేసంస్థలు కూడా అంతకంతకెక్కువయిన బాధ్యతవహించేవిషయంలో నేర్పుచూపేకొద్దీ ప్రజలు సంక్షేమకార్యాలలో తాము నిర్వహింపవలసిన కార్యరంగాలను స్వయంగానే తెలుసుకోగలరు.

ప్రజల సహకారమన్నప్పుడు రాష్ట్రప్రభుత్వాలకూ, స్వచ్ఛందంగా పనిచేసే సంఘాలకూ సమానభాగస్వామ్యత ఉండాల్నని భావం. ప్రభుత్వాలకు ఈసంక్షేమకార్యాలపథకాలు ప్రధానవిషయంకాదనే దురభిప్రాయం ఉన్నది; కాబట్టి, వాటికి ఆకార్యాలనుగూర్చి తఱచుగా జ్ఞప్తిచేస్తూవుండాలి. ప్రభుత్వప్రాతినిధ్యం వహించి ఈ పనులు చేసేవారిపద్ధతులతో తులదూగలేని స్వచ్ఛంద ప్రజాసంఘాల పద్ధతులకు అభిప్రాయాలపొందిక కుదరడం కొంచెం సంశయగ్రస్తమనే చెప్పాలి. అయితే సంక్షేమకార్యక్రమాలవిషయంలో ప్రత్యేకించి చెప్పాల్సిన సందర్భంలో ప్రభుత్వపద్ధతులే చాలాశ్రేష్ఠమైనవనటం సత్యదూరం కాదు. వాటిని వెంటనే అవలంబించి పని చేయాలి,

స్వచ్ఛందసంస్థలు ప్రజాద్రవ్యాన్ని వెచ్చపెట్టే సందర్భంలో, పథకాలకై విధింపబడ్డ నిబంధనలను నియమాలనుమాత్రమే అనుసరించి కచ్చితంగా లెక్క చూపాల్సనే నిర్బంధం ఏమీలేదు. అవి చేసే పథకనిర్వహణాల సామర్థ్యాన్ని విస్తృతినిబట్టి నిశ్చయించాలి. ప్రభుత్వం అట్టిపథకాలను గూర్చిన వివరాలను తెలిపేపట్టికను సమకూర్చగలదా ? చూడాలి.

## II

భారత స్వాతంత్ర్య భానూదయానంతరం మహిళోద్యమం ప్రశంసార్హమైన విజృంభణను అగపరిచింది. శ్రీమతి సరోజనీనాయుడు గవర్నరుగాను, విజయలక్ష్మీ పండిట్ విదేశాలలో రాయబారిగాను పనిచేసి స్త్రీ లోకానికి పేరుతెచ్చారు. శ్రీమతి గుమ్మడిదల దుర్గాబాయమ్మ చెన్నపట్టణంలో ఎన్నో సంస్థలను వ్యాప్తిలోకి తెచ్చి, తన వ్యవస్థాపనాశక్తిని విశదం చేసింది.

("వనితావాణి"నుండి)

# “ ఒకరింటికి వెడితే....! ”

**శ్రీమతి పవని నిర్మలప్రభావతి**

“కాల్గేట్ టూత్ పౌడర్” తప్ప మరొకటి వాడరుట “ఆవిడ!” స్వచ్ఛమైన “తుమ్మచెక్క పొడి” వినా మరొకటి దరికిరానివ్వరుట ఆయనగారు! ఇద్దరూ ఆ రెండు వస్తువులూ మర్చిపోయారు! పోనీ, తెప్పించి ఇస్తామా అంటే, అది చిన్న పల్లెటూరు! మరోచోటనుంచి వచ్చే సరికి రెండురోజులేనా పడ్తుంది. ఎలాగో “తుమ్మచెక్క పొడి” తయారుచెయ్యగలిగాము. గానీ, ఆవిడగారదే పెద్ద బెంగ పెట్టుకుంది మాకు: రెండురోజులు పాచిపళ్ళతో ఎలా గడపగలరు? మరోరకం పేస్టు వాడమంటే, ‘ససేమిరా’ అన్నారు! సరే చివరకు ఎల్లాగో ఉదయం పది గంటలకు “బినాకా”తో, తనసిద్ధాంతాన్ని, నియమాన్నీ, ఉల్లంఘించవలసి వచ్చిందన్న చికాకుతో పళ్ళుతోముకున్నారావిడ!

కొందరి అలవాట్లనూ; నియమాల్ని చూస్తూంటే; సరదాతోపాటు, చిరాకుకూడా వేస్తుంటుంది! అందులోను ఒకరింటికి వెళ్ళినప్పుడు- సర్దుకోలేని ఆ పద్ధతులు ఒక్కోసారి ప్రాణాలు తోడేస్తుంటాయి! జీవితాల్ని మహాత్ముల అడుగుజాడలలో నడుపుకోవాలనే ఉత్సాహంతో; అర్థం లేని కొన్ని అలవాట్లను- సిద్ధాంతాల్ని ' పెట్టుకుంటారు। మంచిదే, అది బాగానేవుంది. అవి మరోచోటుకు వెళ్ళినప్పుడుకూడా అమలుజరగాలనే ఉద్దేశ్యం ఉండటం కూడా మంచిదే! కానీ- మనసిద్ధాంతాల్ని, ఎదుటివారి మీద రుద్దటం అర్థంలేనిపని! ముందు మంచిజ్ఞాపకశక్తి అలవరుచుక, “అవి” తప్ప పనికిరావనే వస్తువుల్నీ, పరికరాల్నీ జాగ్రత్తగా వెంటతెచ్చుకోవాలి! గాంధీజీ, రామకృష్ణ పరమహంస మొదలైన మహాత్ములు, తమకు కావలసిన పెన్సిలుముక్క, కొల్లాయిగుడ్డతోసహా వెంట తెచ్చుకునేవారు- మరొకటి పనికిరావు కాబట్టి! అలాగే మనక్కావల్సిన వస్తువుల్ని మనవెంట తెచ్చుకోటం మొదట నేర్చుకోవాలి! లేదా పొరబాటుగా మర్చిపోయిన పక్షంలో- ఆ రెండుమూడు రోజులకూ తమ “ప్రిన్సిపల్స్” అవతలికి నెట్టి సర్దుకుపోవాలి! అంతే. గానీ వెళ్ళినచోట్ల ఇతరుల్ని ఇబ్బందిపెడితే ఏంలాభం?

ఇక మరోతరగతివాళ్ళున్నారు! ఎవరింటికేనా వెడితే- వాళ్ళక్కనిపించేవల్లా లోపాలే! వాళ్ళ ఇల్లు నీట్‌గా లేదనో, ఆ గృహస్థు, గృహిణి, ఎల్లాగో (ఎక్కువగానో, తక్కువగానే) మాట్లాడారనో; మరింకేదేనా చిన్న విషయాలనో తీసుక విమర్శిస్తుంటారు! ఇలాటి రకాలలో మా పిన్నికూతురు ఒకర్తె! అది ఎవరింటికేనా వెడితే, తాను వెళ్ళింది ఎందుకో మర్చిపోయి- ఆ ఇంటివారి జీవిత చరిత్ర, ఆనవాయితీలు, ఇంటిపునాదులు వగైరాలతో సహా అన్నీ పరికించివస్తుంది. పోనీ వచ్చినమనిషి ఊరుకుంటుందా అంటే, అలాకాదు. ఇక కనిపించిన ప్రతి ఒక్కరితో- “వాళ్ళ పిల్లాడి షరాయివెనక చిన్న చిరుగుంద”నో, ‘ఆవిడ’ చెప్పులజత బాగాలేవనో, అదీ ఇదీ కాకుంటే “వాళ్ళ”కసలు మర్యాదచెయ్యటం చేతకాదనో ఇత్యాదులు వర్ణించి వర్ణించి చెబుతూంటుంది!

మన అవసరానికి ఒకరింటికి వెళ్ళినప్పుడు, మన అక్కర గడుపుకొని సాధ్యమైనంతవరకూ సర్దుకురావాలిగానీ, వాళ్ళ ఇంటి విషయాల్నిగురించి భోగట్టా చెయ్యటం- విమర్శించటం ఏమంత సబబు చెప్పండి?

అన్నయ్య ఒక్కరోజు మరోచోట ఉండాల్సివస్తే, సర్దుకువెళ్ళే సామాను చూస్తే ఆశ్చర్యంవేస్తుంది. పళ్ళుతోముకునే వేపపుల్లదగ్గర్నుంచీ; పడుకోబోయేటప్పుడు అలవాటుగా వేసుకునే “ఒక్కపొడి”వరకూ బేగ్‌లో పెట్టేస్తాడు! సర్దేటప్పుడు చిరాకువేసినా, మరోచోట- ఇతరులకు ఎలాటి ఇబ్బందీ వెయ్యకుండా మెలుగుతాడు అన్నయ్య పద్ధతిచూస్తే ముచ్చటవేస్తుంది.

మరికొందరికి ఇంట్లో పగలూ, రాత్రి; మహాఆలస్యంగా భోజనంచెసే అలవాటుంటుంది. అలాటివాళ్ళు కొంచెం ఇతరుల ఇంటికి వెళ్ళినప్పుడు. కాస్త తమపద్ధతి అవతల పెట్టి, నలుగురితో భోజనంచెయ్యటానికి మనస్సు సర్దుకోవాలి! అంతేగానీ అవతలివాళ్ళూ తమకోసం అల్లాగే కనిపెట్టుక్కూచోవాలనుకోడం- కూచోపెట్టడం మంచిది కాదు!

వీళ్ళంతా ఓరకం! ప్రత్యేకం మరోజాతివాళ్ళున్నారు. మరోఊరికి, బంధువుల లేక స్నేహితుల ఇళ్ళకే ననుకుందాం. అవసరంకొద్దీ వెళ్ళేటప్పుడు- కొంచెం ముందుగా వాళ్ళకు తెలియజేస్తామనే ఆలోచనవుండదు! మరీ అత్యవసర పరిస్థితులలో అప్పటికప్పుడు బయద్దేరటమయితే సరే– ఓ పదిహేనురోజులముందునుంచీ ప్రయాణం అనుకుంటూకూడా, అవతలివాళ్ళకు ఏమాత్రం తెలియజెయ్యరు! అమాంతం “సకుటుంబ బంధుమిత్ర....” అన్నట్లుగా దిగుతారు! పోనీ, దిగినవాళ్ళు వూరుకుంటారా? అంటే ఊహూఁ! తాము వచ్చేసరికి వంటకాలూ వగైరానుంచి అన్నీ సక్రమంగాలేవంటూ విమర్శిస్తుంటారు! ఉరుములేని పిడుగుల్లా వీళ్ళు వస్తారని ఆ గృహస్థులేమైనా కలగన్నారా? కొంచెం ముందుగా తెలియబరుస్తే ఏంపోయిందీ?

ఇంతకూ చెప్పొచ్చేదేమిటంటే, అవసరాలూ, యిబ్బందులూ అందరికీ వస్తుంటాయి. ఒక్కోసారి తప్పనిసరిగా ఇతరులమీద ఆధారపడవలసివస్తుంది! అలాటప్పుడు మన అలవాట్లు (అందులో ప్రత్యేకమైనవి) ఏవేనావుంటే కొంతవరకు తగ్గించుకోవాలి! ఇక మర్యాద, మంచిచెడ్డల్ని గురించి కొంచెం దూరాలోచనకూడా చెయ్యాలి! అవతలివాళ్ళకూ చెప్పుకోలేనివీ, మనకు తెలీనివీ ఎన్నో కష్టసుఖాలువుంటాయి! పైగా ఆ పరిస్థితులలో మనంవుంటే– మనప్రవర్తన, మనఇల్లు వగైరా ఎలావుంటుంది? అనే

చిన్న ఆలోచన తెచ్చుకోగలిగితే, అలా అర్థంలేకుండా విమర్శించలేరు! మనక్కావలసినవన్నీ వెంటతీసుకెళ్ళాలే గానీ, ఎల్లాగూ వెళ్తున్నాంగదా, ఆ బాధ్యత ఆగృహస్థులదేననే ఉద్దేశ్యం వుండటం ఏమంతమంచిదికాదు. ఏదెలా వున్నా. ఒకరింటికి వెడితే సాధ్యమైనంతవరకూ సర్దుకుపోవటం- అందుకు తగ్గఓర్పు- నేర్చుకోవాలి!

---

## దెప్పడం : దెప్పించుకోటం

"వెనుక జడలోన వ్రేలాడు వెదురుటాకు
కలికికోడల! యేరీతిఁ గలిగెనమ్మ!
దెప్పి, దెప్పించుకొను టేమి గొప్పతనము?
అత్త! నీవీఁపు బూడిదెట్లాయె నమ్మ!"
(పూర్వకవి)

---

# కీలెఱిగి వాత

### అయ్యగారి నరసింహమూర్తి

చిక్కవోలను గ్రామంలో
భీముడనే చాకలాడు
కులవృత్తిని మానివేసి
కుశలబుద్ధి యెల్లజూపి
ఉన్నతంపుపదవి యొకటి
ఊరియందె ఉపార్జించి
పొగరుతోడ జీవయాత్ర
సౌఖ్యముగా సలుపుచుండె
పదవివల్ల వానిప్రతిభ
నల్దెసలకు ప్రాకిపోగ
నలుమూలలనుండి వచ్చి
నాలుగు వర్ణాలవారు
వేళపాళలేమి గనక
అహర్నిశలు అరజకుని
యింటియొద్ద గూరుచుండి
నౌకరీలిప్పించు మంచు
పీడింపగ నతని నెపుడు
విసిగిపోయి యొక్కనాడు
రుసరుస కోపించివాడు
'ఏమిటోయి, మీరెల్లరు
గాడిదలా? మానవుల?
నౌకరీలు కాచుచెట్లు
నాదగ్గరలేవు, పొండు'.
అనుచు ఈసడించిపల్క
అందు నొక్కచతుర వక్త
తడవుకొనక అనియె నిట్లు
'గాడిదలము, కావుననే
చాకలి సముఖాచేరి
నౌకరీలు కోరితిమని
వెకిలినవ్వు నవ్వ నచట
ఉన్నవారు చప్పట్లను
గొట్టి గేలిచేసినారు.'

---

# సరోజినీదేవి

(వెనుకటి సంచిక తరువాయి)

మన భరతసీమకు మరలి ఆయమ్మ
వచ్చి, అబ్రాహ్మణ వంశమ్మువాని
ననుపున డాక్టరు నాయడను నతని
పెండ్లియాడెను, కులభేదాలవల్ల
ఆ వధూవరుల కల్యాణము మదిని ॥35॥

మెచ్చక పలువురు మిక్కిలి కడగ
వేలయి, మొగము దప్పించినా రౌర!
అట్టివార్ రానంత ఆగునా పెండ్లి?
అచటి వారే వివాహమొనర్చినారు:
గాలిరాకున్న పంకాలింక లేవె? ॥40॥

వెలుగులేకున్న దివ్వెలుగూడలేవె
ఆ సరోజినియు నాయడుగారు చాల
ప్రేమ కాపురము సల్పిరి: పెక్కులేండ్లు
అపరంజిముక్క విద్యల వేగుజుక్క
ఆ సరోజింగ్లండు కరుగకముందె ॥45॥

పద్యములాంగ్లాన వ్రాయుచుండెడిది
కని వాని సీమలోగలకవుల్ పొగడి
రందొకదొడ్డవాడగు కవీశ్వరుడు
చదివి ఉప్పొంగి యాశ్చర్యాన పలికె:
"తేనెసోనలవలె తీయనివమ్మ! ॥50॥

నీవ్రాతలన్నియు నిజము సరోజ!
ఔర! పదాలకూర్పు + అహహా! భావాలు
భరతభూమిని కనబడువస్తువులను
వర్ణించి పద్యముల్ వ్రాసి పేరొందు,
మంచిదిసుమ్ము, నామాటపాటించు ॥55॥

రాబోవుదినముల రాణింతువమ్మ"
అనగ ఆతని సలహామేరకామె
గాజులమ్మెడుసెట్ల ఘనతను గూర్చి,
బిచ్చగాండ్రనుగూర్చి, బీదల గూర్చి,
జాతిహీనులగూర్చి సాలెలగూర్చి, ॥60॥

తిరుగండ్లపిండ్లు విసరువారి గూర్చి,
పాముల నాడించువారల గూర్చి,
నడువీధిరచ్చల నాట్యాల గూర్చి,
వ్రాసె సరోజిని పద్యాలు చాల
చదివియెల్లరు మెచ్చి శాబాసనంగ ॥65॥

(ఇంకావుంది)

"కౌశిక"

## వెన్నెలతేటలో కన్నెలఆటలు

విద్వాన్- శ్రీ కనములూరి శివరామయ్య

చీకటి నంతా చెదరగగొట్టుచు
లోకముకంతా వెలుగునొసంగుచు
ఆకసమందున అడుగులు వేయుచు

అదిగో అదిగో జాబిల్లి
ఆనందముగా ఉదయించె!

పిండిజల్లినటు పండువెన్నెలలు
నిండుకొనెను భూమండలమంతయు
వెండిపళ్లెమున వెన్నముద్దవలె

ఆకాశంబున జాబిల్లి
ఆనందముగా కనుపించె!

తెల్లనివెన్నెల అలలవెలుగులో
చల్లని మెల్లని పిల్లగాలిలో
అల్లన మనమందర మొక్కటియై

ఆటల వేడుకనాడుదమా!
పాటలుపాడుచు తిరుగుదమా!

కన్నులుమూసే ఆటలనాడుచు
తిన్నగ వెదకుచు తికమికలాడుచు
ఎన్నోవిధముల వెదకుచు పట్టుచు

దొంగదొంగ యని నవ్వుదమా!
తోడివారితో జెప్పుదమా!

వెన్నెలకుప్పలు వేరువేరుగా
కన్నుల కగపడనీక మరుగుగా
కన్నెలు పోయగ తెలిసి నేర్పుగా

కలకలమనగా నవ్వుదమా!
అలకలు చెదరగ నాడుదమా!

రంగారంగా పాండురంగా
రంగరంగ కావేటిరంగా
రారాస్వామీ! రారాద్వారయని

కోలాటమ్ముల వేయుదమా!
కోరిక దీరగ నాడుదమా!

# ANDHRA MAHILA SABHA

## NURSING HOME & NURSES' TRAINING CENTRE

**Statistics for the month of October, 1960.**

**)UT-PATIENT REGISTER:—**

| | | |
|---|---|---|
| | No. of Surgical cases treated | 43 |
| | ,, ,, Medical ,, ,, | 1050 |
| | ,, ,, Ante-natal ,, ,, | 311 |
| | ,, ,, Post-natal ,, ,, | 57 |
| | ,, ,, Gyneac ,, ,, | 114 |
| | ,, ,, Dental ,, ,, | 7 |
| | ,, ,, E.E.N.T. ,, ,, | 43 |
| Total | ,, ,, New Patients | 1,625 |
| ,, | ,, ,, Old Patients | 1,908 |
| | Grand Total | 5,158 |

**N-PATIENT REGISTER:—**

| | |
|---|---|
| No. of Patients admitted for Normal Deliveries | 160 |
| ,, ,, ,, ,, Abnormal Deliveries : (Forceps 9 Version 1) | 10 |
| No. of Surgical case treated | 1 |
| ,, ,, Medical ,, | 110 |
| ,, ,, Ante-natal False Pains | 19 |
| ,, ,, Ante-natal C Toxeamia | 1 |
| ,, ,, Post-natal ,, | 4 |
| ,, ,, Gyneac cases | 30 |
| ,, ,, Babies admitted as Lodgers | 169 |
| Grand Total | 504 |

(True Copy)

Sd.) Dr. K. R. AMBUJA,
*R. M. O.*

(Sd.) Dr. M. PAVANA BAI,
*Medical Superintendent.*

(Sd.) Smt. V. LAKSHMI PARVATHI,
*Secretary.*



## బాలలవిషయంలో శ్రద్ధతీసుకోవడం ప్రభుత్వకర్తవ్యం

ఈనాడు బాలల అభ్యుదయం, వాళ్లకుటుంబాలమీద తల్లిదండ్రులమీద పూర్తిగా ఆధారపడి ఉండలేదు. అది ప్రభుత్వంయొక్కబాధ్యత ; అది సంక్షేమకార్యాలన్నిటిలోను అనుదినం పూర్తిగా అనుసరించవలసిన కార్యక్రమం.

రేపటిపౌరులు కాదగిన యీనాటిబాలల శారీరక, మానసికారోగ్యాభివృద్ధుల విషయంలో మనం నెరవేర్ప వలసిన కర్తవ్యాలను గూర్చి దేశానికి జ్ఞప్తిచేయటానికే, నవంబరు 14-వ తారీఖు "బాలలదినం"గా నిర్ణయింపబడింది బలవత్తరమయిన జాతిగా భావిప్రపంచలో ఖ్యాతివహించటానికి బాలల అభ్యుదయం అతిప్రధానం పిల్లలను వేడుక లలోను, ఉత్సవాలలోను పాల్గొనేటట్లు ప్రోత్సాహంచేయాలి. పై చిత్రంలో— బాలలదినోత్సవాన్ని జరుపుకుంటూ పావురాలను ఆకాశమార్గానికి వదలివేదుతూన్న పిల్లలతోకూడ మనప్రధాని శ్రీ జవహర్లాలునెహ్రూగారు పాల్గొంటూ వుండటం చూడవచ్చు.

---

## వేఁడికోలు

(గీతాంజలినుండి స్వేచ్ఛానువాదం)

శ్రీమతి సోమేపల్లి శారదాదేవి.

నీదుసామీప్యమునుజేరి నిలువ దేని,
కర్మలందున జిక్కి సద్గతిని గాంచ
లేక, తపియించుదేహంబు, లేశమైన
శాంతిలేకయుఁ జిత్తవిశ్రాంతిలేక॥౧.

కొంతసేపైన భక్తితోఁ జెంతఁజేరి,
చింతలన్నియు మఱచి, నాచిత్తమందు
సన్నుతింపఁగ నీదివ్యచరిత, నిన్నుఁ
గన్నులారదర్శింపఁగఁ గాంక్షగలిగె॥౨.

వాడిపోయి సూర్యునివేడి వలన జీవ
పుష్పమూఁడి భూధూళిని క్రుంగుఁగాన
నదినశింపకమున్నె నీ యర్చనకయి
నర్పణమొనర్పవేఁడె నాప్రాణమిదిగో ! ॥౩.

వాసనయెలేని దీచిన్నిప్రసవ, మిద్ది
తగదుతోమాలెలోఁజేర్చి తాల్పనీకు,
జాగుసేయక నీచేయిఁజాచి, త్రుంచి
దిగువఁబడవేయుమా ! ధన్యనగుదు, స్వామి ౪.

# 'జులూ' - జాతి వివాహాచారాలు

వే. వేం. కృ

ఈ 'జులూ'జాతికి చెందినవాళ్ళు దక్షిణ ఆఫ్రికాలోని ఆటవికులు. వీళ్ళలో బహుపత్నీకత నియతంఅనీ, కన్యల్ని పశువులమోస్తరు విక్రయిస్తారనీ, అధర్మప్రాయుడైన జులూ తనభార్యలని చాలాక్రూరంగా హింసిస్తాడనీ,- వాళ్ళకి చాకచక్యాలు, వేడుకవ్యాపారాలు అనేవే లేవనీ, వాళ్ళు అలాంటివి ఎరగనే యెరగరనీ ఐరోపా ఖండవాసులు సాధారణంగా అంటూంటారు.

కాని వాళ్ళవాక్యాలు, దుష్ప్రచారాలూ సత్యానికి చాలా దూరాలు. అబద్ధాలపుట్టలు. ప్రపంచమంతటా మానవ ప్రకృతి ఒకటే. అది దైవనిర్మితం. ఏ చట్టాలూ, ఆచారాలూ దాన్ని అరికట్టజాలవు. జులూపురుషుడు అందరిమోస్తరే భార్యని ఏలుకొనేభర్తే గాని క్రూరమృగంకాదు. చాతుర్యం, నేర్పు, సూక్ష్మబుద్ధి అనేవి పడమటిసీమలోని శ్వేతజాతివనితే గుత్తకు తీసుకోలేదు. ఆమెకు పరదేశాలలోని నల్లజాతుల చెల్లెళ్ళ మెలకువలన్నిట్లో, కదలికలన్నిట్లో, పనులన్నిట్లోకూడా చమత్కారం, హొయలు, విలాసం, హంగు, ఠీవి, హుందా ఉందని గ్రహించటానికి కొన్నిపుట్టుకలు కావాలి.

జులూకన్య తాను వరించిన పురుషుడికి నిమిషంలో టోపీపెడుతుంది. చాలావరకు అతడు ఆమెకు లోబడిపోతాడు, కట్టుకుంటే, ఆమెనే కట్టుకోవాల్నని నిశ్చయం చేసుకుంటాడు. ఆమెతండ్రి దగ్గఱికి వెడతాడు. ఆమెకై అతడు కోరే కన్యాశుల్కాన్ని ఇస్తానని వాగ్దత్తంచేస్తాడు,

జులూజాతిలోని కన్యలు తరతరాలుగా పుట్టిండ్లలోని నిర్బంధాలవల్ల బాహాటంగా తమ అభిప్రాయాలు వెల్లడించరు, పోనీ, యీడేరిన కుమార్తెలకు తల్లిదండ్రులు వివాహంచేస్తారా, అంటే, అదీలేదు. ఆ కన్యే తనకు తగినమగణ్ణి చూచుకోవాలి. ఆతడిష్టపడివచ్చి తండ్రికోరిన శుల్కాన్ని చెల్లించి, ఆమెను పెళ్ళాడాలి.

జులూజవ్వని తాను వలచిన యువకుడికి ప్రేమలేఖ పంపాలి, అలాటిజాబులు చిత్రవిచిత్రాలుగా ఉంటాయి. అసలందులో అక్షరాలుండవు. అవి రంగురంగుల పూసలతో తమ మనోభిప్రాయాలను తెలిపేట్టు, జాణతనంతో సూక్ష్మబుద్ధిని ఉపయోగించి సరాలుతయారుచేస్తారు, పూసలవన్నెలు వాటినికూర్చిచేసిన రేఖాచిత్రాలపట్టీలు చూచి ఆ- అమ్మాయిల సంపూర్ణ మనోభావాన్ని అర్థం చేసుకోలేక తికమకలు పడతారు.

పూసల్లో— తెల్లనివి ప్రేమకూ, ఆకుపసరువన్నెవి విచారానికీ, నల్లనివి ఎడబాటువలని విరహవేదనకూ, ఎఱ్ఱనివి ఏడ్పుకూ, గులాబివన్నెవి బీదరికానికీ, పసుపుపచ్చనివి భాగ్యానికీ, బంగారుకూ గుర్తులు. అయితే, వాళ్ళు తయారుచేసే పట్టీలకూర్పుని, సరాలనమూనాల్ని అనుసరించి. ఆ కన్నెలు వాటిని ఇంకా చిత్రవిచిత్రంగా నేర్పుతో సిద్ధపరుస్తారు. చాలా అందగాడయిన జులూ చిన్నవానికి అలాటి పూసలసరాలు అలవికిమీరినన్ని వచ్చి చాలాచిక్కులు కలిగిస్తాయి,

ఒకే పూసలసరం కన్యావరణానికి సులభమార్గం. దాన్లో ఆరు తెల్లనిపూసలు, ఆరు గులాబివన్నెపూసలు ఉంటే, దాన్ని పంపినబాలిక— ఆ జవ్వనుణ్ణి మనసారా భర్తగా కోరుతున్నాననీ, అయితే తన్ను కొనడానికి సొత్తులేని బీదవాడవడంచేత చింతిస్తున్నాననీ- తెలుపుతుంది.

సర్వసాధారణంగా కన్యకోసం వరుడు ఆమెతండ్రికి ఇవ్వవలసిన వోలి పది పశువులు, ఆమెతల్లికి ఒక పశువు. మరీ పూర్వకాలంలోని జులూ రాజవంశంలోని కుమారికైతే ఇరవై పశువులు కన్యాశుల్కం. జులూపశువు 1కి దాదాపు 5 పవున్లు. కనుక సామాన్య జులూవధువుకై వరుడు ఇచ్చుకోవలసిన శుల్కం 55 పవున్లు.

కాని, ఇలాటి పట్టీల కతికించబడ్డ పూసలసరాల మూగజాబులు ఒకటికంటె మించినసంఖ్యతో ప్రతి తరుణుడికి చేరుతాయి. అలాటివి, అతడి రవికవంటి కంచుకంక్రిందిఅంచున పట్టీలరూపంతో వరుసగా కట్టబడి ఉంటుంది. అతడు ధరించే ఆ పట్టీలసంఖ్యనుబట్టి అతడి సౌందర్యం ఎందరు యువతులను ఆకర్షించిందో సులభంగా తెలుసుకోవచ్చు, అలాంటివాడు తన్నుకోరే వధువులకల్లా తనకువచ్చిన పూసలసరాలపట్టీలు ప్రదర్శిస్తూ డబ్బీలు కొట్టి పంపేస్తుంటాడు. కాని, అందులో ఒకతె అతడి ప్రియురాలు ఉండకపోదు.

తాను వరించిన బాలిక సమీపించినప్పుడుకూడా అతడు గర్వంతో 'అంతశుల్కం నీకెవరిస్తారు- పోపొ' మ్మనే అంటాడు. "మించిపోతే చింతిస్తావు జాగ్రత్త! మళ్ళా, ఒకసారి ఆలోచించుకోవోయ్" అని ఆ జాణ వెళ్ళిపోతుంది. అంతటితో అతడి అహంభావం చల్లగా దిగజారిపోతుంది. ఇక అప్పటినుంచి అతడు ఆమెకయి ఇవ్వాల్సిన వోలి సేకరించటానికి తంటాలుపడతాడు.

# 'జులూ'- జాతి వివాహాచారాలు

అలాటి వరుడు సంపన్నకుటుంబంలోనివాడైతే, తండ్రిని అడిగి, అతడి సమ్మతితో తమ మందలోనుంచి తగినగొడ్లను తీసుకుంటాడు. అలా అతడిష్టపడకపోతే, ఒక తెల్లజాతివానివద్ద నౌకరీచేసి, వేతనంగా పొందే డబ్బు (వోలికి సరిపోయే పశువులుకొనేందుకు) కావలసినంతవరకు సంపాదిస్తాడు. ఇలాటి సందర్భాలలో, జులూ చిన్నవాడు తన జీతండబ్బులు ప్రతినెలా యజమానుణ్ణే చేర్చిపెట్టి తా నడిగినప్పు డిమ్మని కోర్తాడు. తగినంత డబ్బు చేరగానే ఒకపశువునుకొని, దాన్ని తండ్రి పసుల మందకు తోలి కాపాడమంటాడు. ఇలా వోలిపశువులన్నీ చేరినతర్వాత కోరినపిల్లను కట్టుకుంటాడు. ఇలాటి పెళ్లిళ్లు వాయిదాలకు వోలి చెల్లించేపద్ధతిమీదకూడా జరుగుతాయ్.

తరచుగా వివాహమాడదలచుకొన్న యువకుడు కన్నెతండ్రితో ఓవిషయం నిర్ణయించుకొని, పెళ్లి అయిన తర్వాత వాయిదాలపద్ధతితో ఒక్కొక్కపశువుగా అతనికి కొని యిస్తాడు అయితే ఈపద్ధతి అవలంబించినప్పుడు వివాహంఅయిన చాలాకాలంవరకుకూడా పూర్తిగా వోలి చెల్లింపలేని దురవస్థకు పురుషుడు పాలుపడతాడు. కట్టుకొన్న అల్లుడికీ కుటుంబభారం ఏర్పడడం చూచి మామకూడా నిక్కచ్చిచేయటానికి సాహసించడు.

స్త్రీలుకూడా పురుషులమోస్తరే పెండ్లాడేవరకూ తలవెండ్రుకలను పూర్తిగా కత్తిరించుకుంటారు. వివాహితమమయినతరవాతనే వారు కురులు పెంచుతారు. వారు స్నేహితురాండ్రచేత శిరోజాల్ని విచిత్రమయిన గుమ్మటం (Dome) మోస్తరు పైకెత్తి చుట్టించుకుంటారు. ఆ గుమ్మటం చుట్టవెండ్రుకలు ఏండ్లుగడిచేకొద్దీ అంతకంతకు పొడుగ్గా పెరుగుతూంటుంది. ముప్పైయేండ్లనాడు పెళ్లాడినకాంత శిరోజాల గుమ్మటంపొడుగు దాదాపు 18 అంగుళాలు వుంటుంది. అలా, ఆ గుమ్మటం ఒక గుండ్రంగాఉండే చట్రం ఆధారంతో నిర్మించుకుని, దానికి ఎర్రజేగురుమట్టిపూత ఇస్తారు. ఇలాటి కేశసంస్కారం చేయటానికి ఏ స్నేహితురాలైనా ఒకస్త్రీకి అర్ధదినం వినియోగించాలి. ఇది ఆ జాతినారీజనానికి పరస్పర (వినిమయమైన) సహకారం.

'జులూ' జాతుల పాణిగ్రహణమహోత్సవం అనేక విధాలైన సంబంధాలతో చాలకాలం నడుస్తుంది. అవి— ఒక నాట్యాలేనా ? సంగీతాలేనా ? విందులేనా ? అబ్బ ! చెప్పతరంగాదు. అలా రోజులకొద్దీ— కొన్నిసందర్భాల్లో నెలలతరబడి నడుస్తాయ్.

ఆతిథ్యసత్కారాలు అలవికి మీరి ఉంటాయ్. ఏ జులూ కుటీరంలో పెళ్ళి జరుగుతోందో అక్కడికి కొన్ని మైళ్ళచుట్టూ జనాలు చేర్తారు. సామాన్యపరిణయానికైతే ఏవో కొన్నివందలు చేర్తారు. పెద్దకుటుంబంవారి పెళ్లయితే, ఓ ! వేలకువేలు !

ఆ— మహోత్సవాలలో ఆరుబయట ఉడికే మృగమాంసాలు ఉడుకుతూంటే- తినేవాళ్ళు తింటూంటారు. ఇక ఆ ప్రదేశాలలోనే తయారయ్యే కల్లు, సారాల బానలు నూర్లకొలదీ ఖాళీ అవుతాయి. కాని మళ్ళీ నింపుతూనే వుంటారు.

[సౌత్ఆఫ్రికా "దిస్పాన్" అనే పత్రిక]

---

నిర్మలమయిన మానసిక— అహింసనుగాని, ప్రేమనుగాని మనము ఊహించి తెలుసుకొనలేము, గాంధీజీ ప్రతిదుష్టసంఘటన తన మనోనైర్మల్యపరిశోధనకు ఏడ్పడినదని విశ్వసించి, తదనుగుణముగా ఆత్మపరిశీలనకు దానిని ఉపయోగించినాడు. — రాజకీయజీవితమున న్యాయాధికారుల దారుణశిక్షలు, రాష్ట్రమున చెలరేగు విప్లవములు యుద్ధముల వలని క్రౌర్యములు, పరదేశీయుల దౌర్జన్యములు అతిశయించినప్పుడు, మన అహింసాధర్మప్రవక్త. వానివలని అనివార్య హింసలను గూడ అహింసాధర్మబద్ధమగునట్లు మార్పగలిగెను. అట్లు చేయుటలో— అతడాహింసలపైగాని, తత్కర్తల పైగాని— ఏమాత్రము ద్వేషముచూపినవాడు గాడు.

(శ్రీ కామకోటిపీఠ శంకరభగవత్పాదులు)



# మెట్రిక్ పద్ధతి

## కస్టమ్స్ మరియు సెంట్రల్ ఎక్సయిజ్‌లలో



తేదీన కస్టమ్స్ మరియు సెంట్రల్ ఎక్సయిజ్‌లలో మెట్రిక్ పద్ధతి తూనికలు, కొలతలు అమలులోనికి రాగలవు. కాగా అనాటినుంచి సుంకాల రేట్లు మెట్రిక్ యూనిట్లను బట్టియే నిర్ణయించబడగలవు.

ఇప్పుడు అమలులోగల రేట్లు ఆచరణసాధ్యమైనంత సాన్నిధ్యంగా మెట్రిక్ యూనిట్లలోనికి మార్చబడగలవు.

# మెట్రిక్ పద్ధతి

అంతటా ఒకే పద్ధతి — ఎంతో సులభమైనది

భారత ప్రభుత్వం వారిచే జారీ చేయబడినది

DA-60/396

# మరపుకు వచ్చిన మాట

## శ్రీమతి కొమ్మూరి ఉషారాణి

ఈరోజుల్లో చిన్నవాళ్ళు పెద్దవాళ్ళని ఎదిరిస్తేగానీ అభ్యుదయం అనేది ఏకోశానా సంపాదించలేం- అనే భావం ఏర్పడిపోయింది. ఒక్కసాహిత్యం, కళారంగాల లోనే కాదు, వ్యక్తిగత సమస్యల విషయంలోకూడా ఈభావం బాగా పేరుకుపోయింది. పరిస్థితుల మార్పుకి అనుగుణంగా మారినప్పుడే మనసు చురుగ్గా వుంటుంది. కాస్త మధ్యవయసురాగానే ఒకవ్యక్తిలోని ఉద్రేకం చల్ల బడుతుంది. సిద్ధాంతాలనీ, పాతభావాలనీ అతను ఎదురు ప్రశ్న వేయక అంగీకరించి వేస్తాడు. ఇందులో పెద్ద ఆశ్చర్యమేమీ లేదు. కానీ, అలా గుడ్డిగా అంగీకరించ కుండా ఎదురుతిరగాలి. ఇది సంఘ పురోగమనానికి గీటురాయి.

తూర్పుప్రాంతంలో పెద్దలని ఎదిరించటం చాలా కంటగింపుగా ఎంచబడేది; ఒక మహానేరంకిందే జమ కట్టేవారు దాన్ని. పూర్వస్మృతులు, సాంప్రదాయం తండ్రిని ఒకదేవునిగా వర్ణించాయి. తరతరాలుగా తండ్రి వాక్కు బ్రహ్మవాక్కుగా అంగీకరించారు. అతని మాటకి ఎదురు వుండేదకాదు. తర్కానికి అసలు ఆస్కారమే లేదు. పశ్చిమసంస్కృతి తాకిడి, ప్రభావం కలిగేంత వరకూ సాంఘికపరిస్థితి యిలాగే వుండేది. "ధర్మం" అనే వాక్యం ముందు ఎన్నో అన్యాయాలూ, విషాదాం తాలూ జరిగాయి.

అలాటిదే నైగిన్‌కథ. అనగనగా నైగిన్ అనే బాలుండుండేవాడు. చాలా తెలివిగలవాడు. చిన్న వయసు లోనే తల్లిని పోగొట్టుకున్న అభాగ్యుడు. అతని తండ్రి మళ్ళీ వివాహం చేసుకున్నాడు. సవతితల్లి నైగిన్‌ని బాగా చూడలేదు. పొలంపని చూడమనీ, పశువుల్ని కాయమనీ పనులు పురమాయించింది. చదువుకుని బళ్ళోకి వెళ్ళవలసిన వయసులో నైగిన్‌కి ఈపనులు చుట్టుకున్నాయి. 15 సంవత్సరములకే పెద్దరైతులా అతను యింటిపనీ, బైట పనీ చేయసాగాడు. మొట్టికాయలు, తిట్లు ఆహార మయ్యాయి అతనికి. తండ్రి బాగా వృద్ధుడు, అనారోగ్యుడు కావటంవల్ల యివేవీ పట్టించుకునేవాడు కాదు.

సవతితల్లి బాధలు పడలేక చివరికి నైగిన్ యిల్లు వదలి పారిపోయాడు. ముష్టి ఎత్తుకుంటూ బ్రతక సాగాడు. ఒక్కొక్కప్పుడు పస్తుండేవాడు. ఒక్కొక్కప్పుడు కటికనేలమీద పడుకునేవాడు.

ఒకరోజు అలా నడుచుకుంటూ ఓపల్లెకి వెళ్ళాడు. అక్కడ ఓపెద్ద విద్వాంసుణ్ణి కలుసుకున్నాడు. "నీకు రాయటం వచ్చా?" అడిగాడతను. నైగిన్ తాటాకులు, కలం అడిగి, అక్కడక్కడే ఓ చక్కనిపద్యం రాసి యిచ్చాడు. విద్వాంసుడు ఆశ్చర్యచకితుడయి నైగిన్‌ని తన శిష్యుడిగా యింటనే వుండి పొమ్మన్నాడు. నైగిన్ స్వతహాగ చురుకైనవాడు. కష్టపడి పనిచేసేవాడు కావటం వల్ల కొద్దికాలంలోనే గురువుదగ్గిర ఎంతో జ్ఞానం సంపాయించాడు.

అది వసంతకాలం. నైగిన్ ఓమాటు ఉత్సవం చూసేందుకు పక్కపల్లెకి వెళ్ళాడు. ఎందరో విద్వాంసులు, ఐశ్వర్యవంతులు వచ్చారు ఆఉత్సవానికి. నైగిన్, సిగ్గుపడుతూ, జంకుతూ, ఓరగా, ఓపక్కగా నిలబడ్డాడు.

కానీ, నిజానికి ఆసమయానికి నైగిన్‌ని ఎవరూ చూడ లేదు. అందరిదృష్టీ గుళ్ళోనాట్యం చేస్తున్న ఓనర్తకి మీద వుంది. అపరూపలావణ్యవతి అయిన ఆనర్తకి పాటకి అనుగుణంగా పాదాలు, చేతులు కదిలిస్తుంటే దిగ్భ్రమచెంది చూస్తున్నారు సదస్యులు. ఆమె అలా నాట్యం చేస్తూచేస్తూ నైగిన్‌నుంచున్న స్తంభం దగ్గిరికి వచ్చింది. అతనివొంక కళ్ళు యింతింత చేసుకుచూసింది.

మర్నాడు ఉదయం నైగిన్ తన కుటీరంలో చదువు కుంటుంటే నర్తకి అతన్ని చూసేందుకు వచ్చింది. నైగిన్ ఎంతవద్దన్నా వినకుండా అతనికి మంచిబట్టలు, రొఖ్ఖం యిచ్చింది. "తెలివిగలవాడివి, పైకిరావాలి, వద్దనకు" అన్నది. నైగిన్ చాలా సిగ్గుపడ్డాడు. కానీ, వాటి అవసరం ఎంతగానో వుండటంవల్ల సమయానికి కాదన లేకపోయాడు. కృతజ్ఞతతో వాటిని అందుకున్నాడు.

ఆతరువాత నర్తకి తరుచు నైగిన్‌ని వచ్చి చూడ సాగింది. అతని గది సర్దటం, అతనికిష్టమైన వంటకాలు చేయటం, అతని బట్టలు వుతకటం, కుట్టటం- యింటి యిల్లాలిలా సమస్తమైన పనులు చేసి అతనికి తోడ్పడింది. నైగిన్‌కి ఆమెపట్ల గాఢానురాగం ఏర్పడింది. ఆమె అతనియందు తనప్రేమ దాచలేదు. కానీ, వారి స్నేహం ఒక పవిత్రస్నేహంగానే నిలిచింది.

ఓ సంవత్సరం గడచింది. పరీక్షలు దగ్గిరపడ్డాయి. నైగిన్ యింటికి వెళ్ళి తండ్రి దగ్గిరనుంచి తన చదువు

కయిన డబ్బును వసూలుచేయ నిశ్చయించాడు. వెళ్ళిపోతూ నర్తకి నుద్దేశించి యిలా అన్నాడు.

"నేను అతిక్లిష్టపరిస్థితులలో వున్నప్పుడు, లేమితో బాధపడుతున్నప్పుడు నీ పరిచయభాగ్యం కలిగింది. నీ మేలుని ఎన్నటికీ మరువను. నిన్ను మరువలేను. నిన్ను మళ్ళీ ఎక్కడ కలుసుకోగలనో చెప్పు?"

"నువ్వు నన్ను నిజంగా మరువలేకుంటే, నేనే నీ కొరకు వెతుకుతాను. నీ దగ్గిరకి వస్తాను. నేను నీనుంచి ఏ ప్రమాణమూ కోరను. తతిమ్మాది విధికి వదిలేద్దాము. మనకర్మ ఎలా వుందో అలా జరుగుతుంది" అన్నది నర్తకి. నైగిన్ యింటిముఖం పట్టాడు. అతని ముఖాన్ని విచారరేఖలు క్రమ్ముకున్నాయి.

నైగిన్‌ని చూస్తూ తండ్రి సంతోషంతో ఉక్కిరిబిక్కిరయ్యాడు. కొడుకుని మళ్ళీ సజీవంగా చూస్తానని అనుకోలేదు అతను. ఇప్పుడు సవతితల్లి కూడా అతనిపట్ల గౌరవం చూపింది. పరీక్షలు దగ్గిరపడ్డాయి. నైగిన్ అద్భుతంగా రాశాడు.

కొడుక్కి పెళ్ళిచేయవలసిన బాధ్యత తనకి వుందనుకున్నాడు తండ్రి. సంబంధాలు చూడసాగాడు. నైగిన్ మొదట ఈ విషయం పట్టించుకోనట్లు నటించాడు తరువాత వీల్లేదని పోట్లాడాడు. తను ప్రేమించినస్త్రీకి ద్రోహం చెయ్యనని విలపించాడు. కానీ, తండ్రి తన యిష్టప్రకారమే కొడుకు పెళ్లి చేయనిశ్చయించాడు. కొన్నాళ్ళకి నైగిన్‌కూడా మెత్తబడ్డాడు. తండ్రి కోరికని తను మన్నించి తీరాలనుకున్నాడు నైగిన్. నైగిన్ వివాహం తండ్రి యిష్టప్రకారమే జరిగింది. కానీ, నైగిన్ హృదయం నర్తకికొరకు అహతహలాడుతూనేవుంది.

ఓ సంవత్సరం గడిచింది. నైగిన్ యింకా పెద్దపెద్ద పరీక్షలు ప్యాసయ్యాడు. చైనాకి రాయబారి అయ్యాడు. ఆస్థానంలో న్యాయాధికారిగా నియమింపబడ్డాడు.

మరి కొన్ని సంవత్సరాలు దొర్లిపోయాయి. అతని పేరు ప్రఖ్యాతులు దశదిశలా పాకాయి. ఐశ్వర్యం, గౌరవం అతన్ని వరించాయి. ఒకవ్యక్తి ఈ భూమ్మీద కోరుకునే సమస్తమూ అతని వాకిటి నిలిచింది. కానీ, అతని మనసు శాంతి అన్నది ఎరుగదు. అతని హృదయం తృప్తి అన్నది చవిచూడలేదు. అతని కళ్లు ఎప్పుడూ దేనికోసమో ఎదురుచూస్తుండేవి. నర్తకి స్మృతి తాలూకు భావాలు అతని అంతరాంతరాలని పీల్చి పిప్పి చేయసాగాయి.

ఓరోజు ఆస్థానంలో పెద్దవేడుక జరుగుతోంది. మంటపంలో కూర్చున్న గాయకులు, నర్తకుల మధ్య నైగినుకి ఓ చిరపరిచితరూపం కనపడింది. అతను ఆశ్చర్యంతో యిట్టే నిలబడ్డాడు. ఆ రూపంలోని లావణ్యం, చక్కదనం యింకా అలాగే వున్నాయి.....వయసు ఎక్కువ మార్పు తేలేదు. ఇద్దరి చూపులూ ఓ క్షణకాలం కలిశాయి. ఒకరినొకరు గుర్తించుకున్నారు.

ఉత్సవం పూర్తయింది. నైగిన్ కన్నార్పకుండా యింకా ఆమె నలా చూస్తూనే వున్నాడు. కానీ, ఆమె మటుకు కళ్లు తిప్పేసుకుంది. ఎందుకు? ఎందుకు? అతను తనలో తను చాలాసేపు తర్కించుకున్నాడు. అతని మనసులో ఎన్నోప్రశ్నలు చెలరేగాయి. ఆమెని పలకరించాలనుకున్నాడు. ఆతురతతో అడుగులు ముందుకి వేశాడు. కానీ. మరుక్షణం ఆమె మాటలు గుర్తుకివచ్చి ఒక్కడుగు వెనక్కి వేశాడు. "నువ్వు నన్ను నిజంగా మరువలేకుంటే నేనే నీకొరకు వెతుకుతాను, నీ దగ్గిరికి వస్తాను." ఆ క్షణమే అతనికి తను జీవితంలో పోగొట్టుకున్న సమస్తమూ స్ఫురించింది.

[అనుసరణ]

---

మన శరీరాలు గాజుదివ్వెలు. మన జీవితాలే వాటివెలుగులు. ప్రాణవాయువు (Ogxyen) లేనిచో ఈదివ్వెలు ఆరిపోతాయి. కాబట్టి ఈదివ్వెలు వెలగాల్నంటే, వీటిని పరిశుభ్రంగా ఉంచుకోవాలి.

(స్వామి-వివేకానంద)

జాతిధర్మం వ్యక్తిధర్మంకంటె మహోన్నతం. ఈరెంటికీ సామరస్యమే సౌఖ్యప్రదం. (స్వామిరామతీర్థ)

జాత్యభ్యుదయాన్ని ఉద్దేశించి చేసే ప్రతికార్యమూ ప్రకృతిసేవ; దేవతాసేవ. (స్వామిరామతీర్థ)

సంపూర్ణప్రజాప్రభుత్వం, సర్వసమానత్వం, బహిరధికారభారాన్ని నిరాకరించడం. హెచ్చుతగ్గులను పాటించకుండటం.— ఇవే భౌతికరంగంలో వేదాంతం. (స్వామిరామతీర్థ)

# అమృతాంజనము

## అన్ని నొప్పులకు దివ్యామృతము

1893 నుంచి లక్షలాది ప్రజలు అమృతాంజనం వాడి, ఎంత అమోఘమైన శక్తికలదో తెలుసుకుంటున్నారు. అమృతాంజనంలో వాడే ఔషధాలన్నీ అతి శీఘ్రంగా బాధను పశమింప చేయుటయేగాక చాలా హాయిని కూడా కలిగిస్తాయి. హాని కలిగించే పదార్థాలేమీ లేవు కూడా. దగ్గు, జలుబు మొదలైనవి కూడా శీఘ్రంగా ఉపశమిస్తవి. అమృతాంజనం దగ్గర ఉంటే మీ రెటువంటి బాధనైనా జయించవచ్చు:



# నరసాపురం నగిషీ బుటేదారి అల్లికాలు

పశ్చిమ గోదావరిజిల్లాలోని నరసాపూరు తాలూకా ప్రాంతం చాలకాలంనుంచి అల్లికపనులకు ప్రసిద్ధి వహించింది. 20-వ శతాబ్దం మొదటిదశకంలో ఇక్కడి యీ చిత్రకళ ప్రపంచంలోని వ్యాపారసంస్థల్ని బాగా ఆకర్షించింది.

గోదావరిడెల్టా పరిసరాలలో ఈ అల్లికపనుల్ని ఐర్లండుదేశంనుంచి వచ్చిన క్రైస్తవమతబోధకులు ప్రవేశపెట్టారు. తరువాత క్రైస్తవ బ్రహ్మచారిణులు (Nuns) దీన్ని ఐర్లండులో వ్యాపింపజేశారు. ఈనాటికి కూడ ఆ దేశంలోని 'డెవోన్ (Devon)'లో ఈ అల్లిక చిన్నగృహపరిశ్రమగా వాళ్ళు సాగిస్తున్నారు.

నరసాపురం, పాలకొల్లు ప్రాంతాలలో అర్ధదినం పని పనిచేసేవారుగాను, మిగిలిన డెల్టాప్రాంతంలో అర్ధదినం చేసేవారుగాను దాదాపు 5000 మంది స్త్రీలు ఇండ్లలోనే యీ అల్లికపనిచేస్తూ, తమ కుటుంబాలకు ఆదాయాన్ని పెంపొందిస్తున్నారు.

ఈ పనివాళ్ళు, మాంచెస్టర్లో తయారు అయ్యే 'డైమెండుత్రెడ్'— అనే ఒకరకమయిన గట్టి నూలిని వాడుతారు. అందుకు అనుకూలంగా కొక్కెంవంటి వంపుగల సూదులను ఉపయోగించి, వాటితో 'చకచక' అల్లుకుపోతుంటారు. వర్తులాకారం, అండాకారం, నలుచదురం, నిడుపుచతురస్రం— మొదలయిన పరిమాణాలతో, ఈ అల్లికలు 6 అం. మొదలు 72 అంగుళాలవరకు అల్లుతారు. అల్లికయొక్క నైపుణ్యాన్ని, అందాన్ని, మేలిమిని, ఉపయోగాన్నిబట్టి— పరదేశంలోని సంపన్నులు వాటికి కిమ్మతులు (విలువలు) నిర్ణయిస్తారు.

(అద్దాలు తాపిన) బల్లలమీద, వాటి క్రిందిమధ్యభాగంలోను, బల్లలందంతటను యీ అల్లిన అనేకవిధాలయిన వస్త్రాలు శోభాయమానంగా ప్రకాశిస్తాయి. అంతేగాక, అల్పాహారవు బల్లలమీద పరవడానికి, అచిరుతిండ్ల పాత్రలను కప్పివెట్టడానికికూడ అవి విదేశాలలో ఉపయోగిస్తారు. పడుకలపై పరిచే జంటషీట్లుకూడా, అకర్షణీయంగా అల్లుతారు. తలుపులకు, కిటికీలకు కావలసిన తెరలుకూడా తయారుచేస్తారు. చొక్కా-మెడపట్టీలు (Collars), మణికట్టు పట్టీలు (Cuffs), చేతిమేజోళ్ళు (Gloves), ఇలాటివికూడా చిత్రవిచిత్రంగా ఉండేట్టు చేస్తారు. ఈ నరసాపురం అల్లికలు ఈనాటి ఆంగ్ల- అమెరికా యువజనాన్ని లోగొనేంత అందంగా జరుగుతున్నాయి,

క్రైస్తవమతాధికారులు, బోధకులు, బ్యాండువాద్యగాండ్లు ఉత్సవదినాలలో ఈ అల్లికలతో ప్రకాశించే ఉడుపుల్ని ధరించడానికి అనుకూలంగా కాతొలిక్కు-దేశాల వ్యాపారస్థులు ప్రోత్సాహం చేయాలి.

ఈ గృహపరిశ్రమవల్ల ప్రస్తుతం సాలుకు 15 లక్షల రూపాయల వ్యాపారంమాత్రమే జరుగుతున్నది. ఈ కళలో ఆరితేరినవారు ఎవరో కొందరుమాత్రం. ఈ వృత్తిని గృహపరిశ్రమగా సాగించేవాళ్ళకి వేతనాలుఇచ్చి, వాళ్ళు ఆల్లిన సరకులను వ్యక్తిగతంగా తామే తీసుకొని ప్రస్తుతం పరదేశాలకు ఎగుమతి చేస్తున్నారు. ఈ వ్యాపారసందర్భంలో ప్రోత్సాహంకలిగించి పనిచేసేవారిలో ఐక్యత కనబడుతుంది. కాని, ఈ గృహకళ వ్యాప్తిచెందాలంటే, అట్టివ్యాపారులు ఒక సంఘంగా ఏర్పడి యీ చేతిపనికి తగినచేయూతను ఇవ్వాలి.

ఇప్పటి పరిస్థితిలో ఈ పరిశ్రమాభివృద్ధిని కోరే ఎగుమతిదార్లు కొన్ని క్లిష్టసమస్యల్ని ఎదుర్కోవలసివస్తున్నది. ఎగుమతిదారుడు సాధారణంగా తగినంత పెట్టుబడి పెట్టలేనిస్థితిలో ఉంటాడు. అలాటప్పుడు అతడు ఋణదాతల అనుగ్రహాన్ని సంపాదించకతప్పదు, ఇక అన్నిఖర్చులుపోగా, అతడికి మిగిలే లాభం చాలా స్వల్పం. అనగా 100కి 15 గిట్టేటప్పటికి 'విన్నుపట్టు నన్నుపట్టు'— అన్నట్లు అవుతుంది. ఈ చిత్రపుటల్లిక పనితనాన్నిగూర్చి, తరతమవ్యవస్థ నిర్ణయించే సంఘం లేకపోవటంమూలాన ఉత్తమమయిన అల్లికను అదుపులో (Control) ఉంచుకునే సంస్థగా అటు ప్రభుత్వం గాని, ఇటు ఒక సంఘంగాని పూచీవహించడానికి వీలు కలగటంలేదు. ఇంతకూ కారణం, ఈ విదేశవ్యాపారం చేసే వర్తకులంతా సంఘీభవించి ఒక సంఘాన్ని యేర్పరచుకొని దానిగుండానే పరదేశవ్యాపారం సక్రమపద్ధతితో నెరవేరేమార్గం చూడకపోవడమే.

ఇప్పుడీవృత్తిలోని (కళలోని) సాధకబాధకాలన్నీ చాలావరకు తొలగిపోయినవి. ఈ వ్యాపారంలో ప్రవీణులయినవారు సంఘాలుగా ఏర్పడి కొంతవరకూ ఈ చేతి పనికి (సాధ్యమయినంతవరకూ) దోహదంచేస్తున్నారు. రాష్ట్రప్రభుత్వపు వాణిజ్య పరిశ్రమ శాఖల అధికారవర్గం కూడా ఈ కళయొక్క ఉపయోగాన్ని గుర్తించి, పునరుద్ధరించ ప్రయత్నిస్తోంది. అఖిలభారత గృహపారిశ్రామిక సంస్థ ఇటీవల ఈ చేతిపనినిగూర్చి అనుపూర్విగా

(తరువాయి ప్రక్కపుటలో)

# కూచిపూడి నాట్యమండలి

## (శ్రీ బి. రజనీకాంతరావుగారి ఆంగ్ల వ్యాసాని కనువాదం)

కృష్ణామండలమందలి దివితాలూకాలోని 'కూచిపూడి', 'మొవ్వ' గ్రామాలు కడచిన యేడు శతాబ్దాలుగా ప్రాచీన సంప్రదాయసిద్ధమయిన నృత్య సంగీత నాట్య ప్రదర్శనాలలో చాల అభివృద్ధి చెందినవి. క్రీ. శ. 1400 సం॥ ప్రాంతంలో – శ్రీ సిద్ధేంద్ర యోగి కూచిపూడి గ్రామంలో నాటకరంగాన్ని స్థాపించి, ఆ యూరిలోని ప్రతి బ్రాహ్మణబాలుడు భరతశాస్త్రాన్ని అనుసరించి, సంగీతం, నృత్యం, నాట్యం నేర్వవలెనని, తాను యక్షగానంగా రచించిన భామాకలాపంలోని సత్యభామాపాత్రను నటించటంలో తర్ఫీతుపొందవలెనని ఆదేశించాడు. మాచుపల్లి కైఫీయత్తులో- క్రీ. శ. 1502 సం॥ విజయనగర సార్వభౌముడైన సాళ్వనరసరాయలు కూచిపూడి భాగవతమండలి ప్రదర్శించిన 'కేళిక' అనే నాట్యాన్ని చూచి మెచ్చుకొన్నట్లు తెలుపబడిఉన్నది.

శతాబ్దులకొలది నృత్య సంగీత నాటక ప్రదర్శనాలు లక్ష్యలక్షణాలతో కూచిపూడి భాగవతులు నేర్చి ఆ కళను చాల పెంపొందించారు. కూచిపూడి నాటక కుటుంబ సమితులు తెలుగుదేశమందంతటా సంచరింపసాగినవి. అంతేగాక 16-వ శతాబ్దిమధ్యను అవి దక్షిణదేశానికికూడ వెళ్ళి నాయకరాజులను, తంజావూరు మహారాష్ట్ర ప్రభువులను తమ కళా ప్రావీణ్యంచేత మెప్పించి మిక్కిలి గొప్పగొప్ప బహుమానములందినవి. తరువాత ఆ సమితులలో ప్రఖ్యాతులయినవారు కొందరు, తమ నృత్య సంగీత నాటక కళా వ్యాప్తికొఱకు మేళత్తూరును స్థిరనివాసముగా చేసికొన్నారు. దక్షిణానికి వ్యాపించిన యీ మేళత్తూరుశాఖలో, వీరభద్రయ్య, కాశీనాథయ్య, వెంకటరామశాస్త్రి మొదలగువారును, పల్లవి గోపాలయ్యయు ప్రసిద్ధికెక్కిన యక్షగానరచయితలు.

ఇట్టి పూర్వచరిత్రంతో ఈనాటివరకు ఎడతెగక సంప్రదాయసిద్ధంగా వస్తూన్న ఈ కూచిపూడి భాగవతకళ ఒకరవంత వెనుకబడినా, నాట్యాచార్య శ్రీ చింతా కృష్ణమూర్తి పరిశీలనాధికారంక్రింద పునరుద్ధరింపబడడం ఎంతైనా మెచ్చతగింది.

కూచిపూడి, విజయవాడ- మచిలీపట్నాలకు వెళ్లే బస్సుల రహదారిలోని పామర్రునకు కుడిదిక్కున కృష్ణాడెల్టాలోని గ్రామం. అది విజయవాడకు 32 మైళ్ళ దూరంలోను మచిలీపట్నానికి 15 మైళ్ళ దూరంలోను ఉంది. దీనికి 'కుచేలపురం' అనే నామాంతరంకూడా ఉంది.

కూచిపూడిలోని ప్రతిబాలుడికి (వైష్ణవమతస్థుడు కాని, శైవమతస్థుడుకాని) "గజ్జెకట్టు"- అనే వుత్సవాన్ని పారంపర్యంగా మూఢభక్తితో నడుపుతారు. అయితే, ఆ రెండు మతాల్లోను కాలికి గజ్జెలు కట్టుకొని ఆడడం వ్యాప్తిలో ఉన్నది. వారు ఆడే నాటకాల్లో అనేకకథలు భాగవతానికి సంబంధించినవి అందులో ముఖ్యమయింది భామాకలాపం. అందుచేత వారి ప్రదర్శనాలను 'భాగవతం' అనీ నటకుల సమూహాన్ని 'భాగవత సంఘం'- అనీ అంటారు.

కూచిపూడి భాగవత నాటకరంగం సామాన్యమైనది. అంత గంభీర నిర్మాణంకాదు. అది దేవాలయావరణంలో కట్టబడిందైతే, రంగమంటపం అంటారు. లేదా, వెదుళ్ళతోను తాటాకులతోను బహిరంగ ప్రదేశంలో తాత్కాలికంగా నిర్మించుకుంటారు. ఇరువురు చాకళ్లు చింపిగుడ్డలు చుట్టి, అప్పుడప్పుడు నూనెలతో తడుపబడు దివ్విటీలతో రంగస్థలమునకు వెలుగు కలిగిస్తారు. వాళ్ళు ఆట ముగిసే వరకు రాత్రి తెల్లవారుదాక ఆ దివ్విటీలను ఓపికతో పట్టుకొని నిలిచి వుండవలసినదే. నటకులు రంగస్థలం ప్రవేశించేటప్పుడు, నిష్క్రమించేటప్పుడు చిత్రవర్ణాలుగల ఒక తెఱను అడ్డంగా వారు పట్టుకుంటారు. ప్రవేశించే వేషధారినిగూర్చి బిగ్గరగా రాగతాళవాద్యాలతో వర్ణిస్తూ, దివ్విటీలమీద గుగ్గిల దూపంవేస్తూ తెఱతీయగానే ఆ పాత్ర ప్రత్యక్షం అయ్యేట్టుచేస్తారు.

(సశేషం)

[ 13-11-60 హిందూ పత్రికనుండి ]

---

(ముందుపుట తరువాయి)

**విచారణలు జరిపి, యీ వృత్తిని ఎదుర్కొనే క్లిష్టపరిస్థితులను, గడ్డుసమస్యలను అవగాహనచేసుకోవడానికి శ్రద్ధతో పూనుకొన్నది. అలాటి ప్రయత్నాలు, ఈ పరిశ్రమ అభివృద్ధికి క్రమంగా వచ్చేకొద్దీ, సఫలీకృతం కాగలదని ఆశించవచ్చును.**

(ఆగస్టు 'కారవాన్'లోని శ్రీ కృష్ణశాస్త్రిగారి ఆంగ్లవ్యాసంనుంచి)

# మదరాసు మాతృ పంచకం

## (శ్రీ ఎం. ఏ. హుసేని ఆంగ్ల వ్యాసాని కనువాదం)

వార్ధకం సంభవించి విశ్రాంతి పొందవలసినస్థితి సంభవించేపక్షంలో, ఆంగ్లగ్రామ పరిసరాల్లోగాని మదరాసు నగరంలోగాని జీవితం గడపాల్నని నా కెంతో అభిలాష. ఆ ప్రదేశాలు వట్టిపోయి వరుగైన నా హృదయానికి నిత్యనూతన చైతన్యాన్ని చేకూర్చి ఉల్లాసాన్ని కలిగిస్తుంది.

మదరాసు నగరం మిక్కిలి వేండ్రమయిందని. చెమ్మచేత చితచితలాడేదని, నిస్సారమయిందని చాల మంది వ్రాశారు. కాని, సరిగా మిట్టమధ్యాహ్నసమయాన సముద్రముమీదినుంచి వచ్చే చల్లని మంద మారుతాన్ని అనుభవిస్తూ నగరాన్ని చూడవచ్చిన వ్యక్తి ఆ యెండవేళ గలిగినహాయికి— ఆప్యాయతకు ఆనందపడుతూ తన యిచ్చవచ్చినట్లు సంచరిస్తాడనే విషయం వాళ్ళలో అనేకులు సూచించనైనా సూచించలేదు. వీధివీధులలో తిన్నగానడిచే— ఆ ప్రేక్షకుడు, పురాతనపు ఔన్నత్యాన్ని చాటుతూ, తామరలతో నిండిన తటాకాలలో ప్రశాంతంగా- స్థిమితంగా, ప్రతిబింబించే గుళ్లు గోపురాలు అతడి కాహ్లాదాన్ని కలిగిస్తాయి. విశాలములైన వీధులలో నవీనపద్ధతులను అనుసరించి నిర్మించబడి శోభాయమానం అయిన పచ్చనితరువులమధ్య- సొగసుగా తలలుఊచే- ఇరుపార్శ్వాలలోని కొబ్బరిచెట్లనడుమ— అందాన్ని సంతరించే గొప్పగొప్ప నాజూకైన భవనాలు ఆ- అన్య ప్రదేశవాసి కనులకు విందులు గొలుపుతాయి. ఆనంద పారవశ్యంతో నేలబడి పొరలాడే శ్వానం మోస్తరు. తిన్నగా చప్పుడుచేస్తూ సముద్రపుటలల పొరలు "మెరీనా" తీరాలలో దొరలాడడం చూచి ఎవడైనా అబ్బురపడతాడు. ప్రకృతిసౌందర్యం- నాగరికతా వైభవం- ఈ రెండూకూడా ఆ- ఒక్కచోటనే చూడటంవల్ల ఎంత ఆనందం ? ఎంత మనశ్శాంతి !

మద్రాసు కేవలం దృగ్గోచర సౌందర్యంచేతనే కాక, కుశాగ్రబుద్ధి, విద్యావివేకములుగల వ్యక్తుల ఉనికిచేతగూడ ప్రసిద్ధికెక్కింది. అక్కడివారు కష్టపడి పనిచేసేవారు; క్రమశిక్షణ గలవారు: నిజాయితీతో నడుచుకొనేవారు; అతిథులను ఆదరించేవారు; వాక్చాతుర్యము గలవారు; అన్నిటను మిక్కిలి నేర్పుగలవారు. పౌరవిషయములలో న్యాయబుద్ధితో చరించుటకు సంసిద్ధత చూపేవారు. ఆ కారణంచేతనే- కేంద్ర సంఘ సంక్షేమవ్యవస్థ యేర్పడి పని ప్రారంభించటానికి ముందే, స్వయంగా సంక్షేమకార్యాల్ని నెరవేర్చే సంస్థలు- 'స్త్రీ జన భారతీయ సంఘం' (Women's Indian Association)- 'సేవాసమాజం' (The Guild of service)- 'ఆంధ్ర మహిళాసభ' మొదలైనవి స్థాపింపబడ్డవి.

తుదకు ఏ కార్యంగాని, దాన్ని పూనుకొనేవారెంత ఉత్తములో అంత ఉత్తమంగా నెరవేరటం సహజం. తన సంక్షేమాభ్యుదయ కార్యకర్తలకు మదరాసు ఋణపడి ఉంది అనటంలో సంశయంలేదు. నేను అట్టివాళ్ళలో అయిదుగుర్ని గురించి- వారు చేస్తూన్న పనులను గురించి యీ వ్యాసంలో సూచిస్తున్నాను. వాళ్ళని 'మదరాసు మాతృపంచకం'గా భావిస్తున్నాను. ఏలనంటే, శారీరకంగా, మానసికంగా బాధపడుతూండే నూర్లకొలది ప్రాణులకు వాళ్ళు తల్లులలాంటివాళ్లు. రోగపీడితులయిన మానవులకు, దురదృష్టవంతురాండ్రయిన మహిళలకు, దిక్కుమొక్కులేని బిడ్డలకు, మొత్తంమీద వెనుకబడ్డవారికి, అజ్ఞానులకు, అవిద్యావంతులకు వాళ్లు నిజంగా జననిమ తల్లులే.

అట్టి తల్లులలో ప్రప్రథమంగా పేర్కొనతగిన ఆవిడ— డాక్టరు యస్. ముత్తులక్ష్మిరెడ్డి. ఆమె విశ్వవిద్యాలయ పట్టములు పొంది వైద్యవృత్తి అవలంబించి అందులో చాలా అభివృద్ధిని, అనుభవమును గడించింది. కాని, స్త్రీల హక్కులకై రాజకీయంగా పోరాడటానికై దాన్ని వదలాల్సి వచ్చింది. భారతదేశంలో మొట్టమొదటి శాసనసభ్యురాలైన మహిళ ఆమెగారే. తరువాత ఆమె శాసనసభకు ఉపాధ్యక్షురాలైంది. కాని, బాపూజీ బహిష్కరణోద్యమ శంఖారావము విని, దాన్ని విడిచిపెట్టింది. అప్పుడామె స్త్రీజన భారతీయ సంఘంలో చేరి, స్త్రీ శిశు జనాభ్యుదయాన్ని ఉద్దేశించి 'అవ్వైహోం'- అను సంస్థను స్థాపించింది.

'అవ్వై హోం' 1930 సం॥లో స్థాపింపబడింది. అందలి పిల్లలు తమకు కావలసిన పనులను తామే చేసుకోవాలి. అది ఒక చిన్న "శిశు ప్రజారాజ్యం". అది వృత్తి సంబంధంగా, చేతిపనుల సంబంధంగా తరిబీతును ఇస్తుంది. నిరుద్యోగులకు, నిరాధారులకు తగిన

స్థానమిచ్చే పథకాన్ని అనుసరించి అవ్వైహోం పని చేయటానికొక శాఖను ఏర్పరిచింది. ఆ శాఖ అట్టి జనులకు వసతులు (తగినట్లు) కల్పించి సాంఘికంగా, ఆర్థికంగా సేవచేస్తోంది.

వ్రణచికిత్సా కేంద్రం 1955 సం॥న స్థాపింపబడింది. ఇందులో 140 మంది రోగులకు పడకలున్నాయి. నవీన సాధనాలతో క్రొత్తక్రొత్త విధానాలను అనుసరించి ఈ వైద్యశాలలో చికిత్స జరిగే సౌకర్యాలన్ని అమర్పబడినాయి. పరిశోధన శాఖలో- రేడియోతో పనిచేయు అనేక రసాయనిక యంత్రాలు- (Radio-active beams, Radio-active chemistry, Biology, Bio-chemistry and Enzyme chemistry). వెవ్వేరుగా నెలకొల్పబడినాయి.

రెండవ తల్లి- శ్రీమతి యస్. అంబుజమ్మాళ్. డాక్టరు ముత్తులక్ష్మిరెడ్డి కంటె ఈవిడకు కాంగ్రెసుతో ఎక్కువ సాన్నిహిత్యం ఉంది. ఈమె పెక్కుసార్లు అరెస్టయి జైలుకు వెళ్ళింది. అప్పుడీమెకు డాక్టరు రెడ్డి,- 'దేశంలో రాజకీయంగా స్వాతంత్ర్యానికై పోరాడేవాళ్ళకి ఏమాత్రం కొరతలేదు; కాని సంఘ సేవకోసం పూనుకొనేవాళ్ళే చాలాతక్కువ. కాబట్టి మీరు అందులో ప్రవేశిస్తే బాగుంటుం'-దని సలహా ఇచ్చింది. అంబుజమ్మాళుకు అది నచ్చింది. వెంటనే భారతీయ స్త్రీల సమాజంలో చేరి మగువలకి, బాలలకి సేవచేసే నిర్మాణకార్యక్రమాన్ని చేపట్టింది. ఈమె 1948-వ సం॥న (ఒకప్పుడు) కాంగ్రెసు అధ్యక్షుడుగా ఉండిన తన తండ్రి యస్. శ్రీనివాస అయ్యంగారి పేరితో బాపూజీ పేరినికూడ చేర్చి 'శ్రీనివాస గాంధీ నిలయం' అనే నామధేయంతో ఒక మందిరాన్ని కట్టిచ్చింది. అది సాంఘిక సేవకెంతయినా ఉపయోగకరంగా ఉంది. అందు 'బేసిక్' విద్యకు తరిబీతునిచ్చే తరగతి ఒకటి నడుస్తున్నది. ఒక ఉచిత వైద్యశాలకూడ గలదు. నూలు వడకటం, నేత, అల్లిక, కుట్టుపని తక్కిన చిన్న చేతిపనులు ఉచితంగా ఆ నిలయంలో నేర్పబడుతున్నాయి. ఈడుమీరిన (బాల్యందాటిన) స్త్రీలకు ప్రాథమిక విద్యాబోధన మివ్వబడుతోంది. ప్రతిదినము 150 మంది వ్యక్తులకు పాలు ఉచితంగా పంచబడుతోంది. సంఘసేవకై కన్యాస్వచ్ఛంద దళాలకు తరిబీతుకూడ ఇవ్వబడుతోంది.

మదరాసుకు మూడో మాతగా ఎన్నదగిన వనితారత్నం— శ్రీమతి మేరీక్లబ్ వాలా జాధవ్. ఆమె నడిపే సంస్థకు 'సేవాసమాజం' (The Guild of Service) అని పేరు. పెక్కువిధాలయిన సంఘాభ్యుదయ కార్యాలను,— సరిసమాన స్థితికి తెచ్చి, అట్టికార్యాలు లేని ప్రదేశాలల్లో వాటిని వ్యాపింపజేయగల సంస్థలను స్థాపించేటమే సేవాసమాజంయొక్క ముఖ్యోద్దేశం.

సేవాసమాజం- పెద్దయెత్తున విస్తృతి చెందాల్నని స్థాపింపబడ్డ గొప్పసంస్థ. ఈ సమాజశాఖలు చెన్నరాష్ట్రంలోని జిల్లాలలోను, తాలూకాలలోను గలవు. ఆంధ్ర, మైసూరు, కేరళ రాష్ట్రాలలో రాష్ట్రీయశాఖలుకూడ ఉన్నాయి. అస్సాం, బీహారు, మధ్యప్రదేశ్, ఉత్తరప్రదేశ్‌లలో దీని శాఖలు వెలుస్తున్నాయి. 1958—59 లో ఈ సమాజానికి 68 జిల్లా తాలూకా శాఖలు ఉండినాయి. ఇవిగాక దీనికిలోనై పనిచేసే ప్రత్యేకసంస్థలు 150 ఉండినాయి.

ఈ సమాజకార్యాలలో ఆయా వైద్యశాలలందు గల రోగులయొక్క యోగక్షేమాలు పరామర్శిస్తుండటం ఒకటి. మదరాసు నగరంలో అన్ని వైద్యాలయాలను (తాంబరంలోని క్షయరోగుల ఆస్పత్రితో సహా) ఈ సమాజంలోని కార్యకర్తలు అప్పుడప్పుడు సందర్శించటానికీ, ఉత్తరప్రత్యుత్తరాలు నడపటానికీ- ఉచితంగా ఔషధాలు ఈయటానికీ, వ్యాధిగ్రస్తులకు బజార్లలోనుండి కావలసినవి తెచ్చి యివ్వటానికీ- పిల్లల వార్డులలో శిశువుల విహారాలు (Nursery Schools) ఏర్పాటుచేయటానికి— వ్యాధిపీడితుల కాలక్షేపంకోసం పుస్తకాలు అరువుగా ఇవ్వటానికి— తగిన యేర్పాట్లు ఉన్నాయి.

సేవాసమాజం అనేక శిశువుల విహారాలను నడుపుతోంది. దీని బాలబాలికల శరణాలయాలకి కొందఱు ఉదారస్వభావులు వాళ్ళ పోషణార్థమయ్యే ఖర్చులను భరిస్తున్నారు. అట్టివారి కా శిశువులు దత్తపుత్రీపుత్రులుగా ఎన్నబడుతున్నారు. ఈలాటి సాకుడు తలిదండ్రులచే చాలమంది బిడ్డలు దత్తులుగ స్వీకరింపబడే పథకం ఎంతో జయప్రదంగా ఆస్ట్రేలియా, కానడా, అమెరికా సంయుక్తరాష్ట్రాలలో పనిచేస్తున్నది. అడయారులో బాలికల కొకశరణాలయం సాలిగ్రాంలో మరొకటి, పల్లిపట్టులో ఒక వసతిగృహం పనిచేస్తూన్నాయి. ఇంకా, కుటీరవాసుల సంక్షేమ కార్యాలలో శ్రద్ధవహించి పనిచేయటానికి సామిరెడ్డి పురంలో ఒక శిశుసంరక్షణ కేంద్రం, దాంతోబాటు

మానసికంగా బలహీనులైన పిల్లలకు 'బాలవిహారం' ఒకటి నెలకొల్పబడి పనిచేస్తోంది. యుక్తవయస్కులు కానివారిని సక్రమపద్ధతిలో నడిపేకేంద్రం—, బాలల పుస్తకాలయం,- తల్లిదండ్రులు పిల్లల్ని పెంచాల్సిన విధానాలు తెలిపేసంస్థ,- సమాచార (వార్తల) వివరాలు అవగాహన చేసుకొనేశాఖ,— సరియైన దారిలో సంక్షేమాభ్యుదయాలను విస్తరింపజేసి ముందుకు నడిపేనిర్మాణం- వీటిని ఈ సమాజం నడుపుతూంది. యువకులకు సామాన్యప్రజలకుకూడా సంక్షేమకరకార్యాలు కొలదికాలములో పూర్తి అయ్యే పద్ధతులు, విధానాలు ఈ సమాజం సూచిస్తూ పథకాలు నిర్మించింది.

ఈ సమాజకార్యక్రమాలలో మదరాసు సాంఘిక సేవావిద్యాలయం, (Madras School of Social Work),— ఆక్సుఫర్డు క్షామనివారణసంఘం (Oxford Committee of Famine Relief),- కానడాలోని ఐక్యకేంద్రసేవా సంఘం (The Unitarian Service Committee of Canada) తోడు నీడలై నిలిచి సహకరిస్తున్నాయి:

మదరాసుకు నాలుగవ తల్లిగా నేను శ్రీమతి దుర్గాబాయి దేశముఖును పరిగణిస్తున్నాను. ఆమె ప్రకృతం— ఆసేతుశీతాచలపర్యంతం యావద్దేశానికీ— కేంద్ర సంఘ సంక్షేమ సంస్థాధ్యక్షురాలుగా ఉన్నా, ఆమె మద్రాసులో నెలకొల్పి వృద్ధికి తెచ్చిన "ఆంధ్ర మహిళాసభ" అత్యద్భుతంగా ఈనాటికీ తన పనులను నిర్వర్తిస్తున్నది.

ఈ ఉద్దేశంతో- "చిన్నారి కన్నెల బృందావనం" (Little Ladies of Brindavan) అని శిశువులకొక చిన్నసంఘం 1937 సం॥న స్థాపించబడింది. ఆ బిడ్డలతోబాటు వాళ్ళతల్లులుగూడ అక్కడికి వచ్చేవారు. అట్టివారికి హిందీ నేర్పడానికి నిశ్చయింపబడింది. త్వరలోనే మెట్రిక్యులేషన్ తరగతులుకూడా ప్రారంభించటంతో— సైన్సుసెక్షను, ఒక గ్రంథభాండాగారం, ఒక వసతిగృహం, క్రీడారంగం ఏర్పడినాయి. ఈనాడీ సంస్థ- మహిళా విద్యాలయాన్ని, చాపలల్లటం, పేముపనులు, నూలువడకటం, నేతనేయటం, కుట్రపుపనులు, బుటేదారిపనులు- ఈలాటి చేతిపనులునేర్పే పారిశ్రామికశాలని నడుపుతోంది. ఈ సంస్థకు మహిళలచేతనే పనులు జరుపబడే ముద్రణాలయంకూడ ఉన్నది. స్త్రీలే- అక్కడ అచ్చుకూర్పర్లుగా, ముద్రించేవారుగా, పుస్తకాలు బైండుచేసేవారుగా పనిచేస్తున్నారు. జాతీయగ్రంథసమితి (National Book Trust) ప్రచురణలు ఈ ముద్రాశాలలోనే అచ్చు అవుతున్నాయి.

సభాకార్యాలయోద్యోగినుల శిశుసంరక్షణకయి "శిశువిహార్",- వాళ్ళ ప్రాథమికవిద్యకై "వనితా బాలవిహార్",- బిడ్డలను పెంచేవిషయంలో శ్రద్ధపుచ్చుకొనే మంత్రసానులకు, దాదుల (Nurse Midwives)కు రెండేండ్ల తరిబీతు నిచ్చే కళాశాల, ఒక ఉచితవైద్యాలయం మహిళాసభ యాజమాన్యం క్రింద పనిచేస్తున్నాయి. ప్రసవవైద్యశాలతో బాటు శిశుసంక్షేమకేంద్రాన్ని, ఈశ్వరీ ప్రసాద దత్తాత్రేయ శిశువికలాంగ చికిత్సాకేంద్రాన్ని, కుటుంబనియంత్రణంలో తరిబీతునిచ్చే ప్రాంతీయ సంస్థను- ఈ సభ నడుపుతోంది. ఆంధ్రరాష్ట్రశాఖయైన యీ మహిళాసభ హైదరాబాదులో స్త్రీలకు గృహపరిశ్రమలు మొదలయినవి నేర్పుతుంది.

అయిదవతల్లి దక్షిణభారత విద్యాసంఘాధ్యక్షురాలైన శ్రీమతి ఫాతిమాఅక్తార్. సర్వసాధారణంగా దేశస్థులందరిలోను- ముఖ్యంగా వెనుకబడ్డ జాతివారిలోను విద్యాభివృద్ధిచేసే ఉద్దేశంతో పైసంఘాన్ని శ్రీమతి అక్తార్ భర్త- ఉన్నత న్యాయాధికారిగా ఉద్యోగము నిర్వహించి, ప్రకృతం విశ్రాంతినొందియున్న శ్రీ బషీరు అహ్మదు సయ్యీదుగారు 1951 లో స్థాపించిరి.

తొల్త వీరు 1955-56 సం॥న- పూరిపాకలలో స్త్రీలకయి ఒక కళాశాల ప్రారంభించిరి. అప్పటినుంచి అది చాలవరకు అభివృద్ధిచెంది, అందమయిన

భవంతులకు మారినది. ఇప్పుడా కట్టడములలో విద్యార్థినులకొక వసతిగృహం, గృహకృత్యవిజ్ఞాన (Home Science) శాల- ఈదులాటకొక మడుగు, గృహనిర్వహణకళాభ్యాసమున కొక ఆదర్శకుటీరం, 1000 మంది ప్రేక్షకులు కూర్చుండి చూడవీలైన నాటకశాల, దాదాపు పండ్రెండు క్రీడారంగాలు వెలుస్తున్నాయి. ప్రకృతం 200 విద్యార్థినులకు ఒక వసతి గృహం నిర్మిస్తున్నారు. అది పూర్తి కావస్తుంది.

ఈ దక్షిణభారత విద్యాసంఘమువకు భార్యాభర్తలు (అక్థార్ సయీాదులు) నిరంతరము ఏకమనస్కులై శ్రమించి 26 లక్షల ద్రవ్యము ఉపార్జించి పెట్టుబడిపెట్టారు. మరికొన్ని ప్రణాళికలు నెరవేరటానికి ఇంకా 15 లక్షల ద్రవ్యం కావలసివుంది. ఈ సంఘనిమిత్తం ధనసేకరణకై శ్రీమతి ఫాతిమా అక్థార్, ఆమెభర్త యావద్భారతదేశర మాత్రమే కాక, నైరోబీ, కంపాల, లుగాజీ, జింబా, మొంబాసా, జాంజిబార్, దార్ ఇస్లాం, తూర్పు ఆఫ్రికాలోని టాంగా, కెయిరో, డెమాస్కస్, బీరట్ జెరూసలేం, బాగ్దాద్, బాస్రా, కువైట్, బాహ్రైన్ కటార్ మున్నగు పశ్చిమ ఆసియాఖండ ప్రదేశాలను సంచరించారు. మలయా, సింగపూరు, బర్మా, సిలోనులలోని హైందవులనుండికూడ విరాళాలు పోగుచేశారు.

ఔదార్యం, నిస్వార్థంగల ప్రజాసేవకులకు మదరాసు విఖ్యాతిచెందింది- అని నేను దృఢంగా చెప్పగలను. వారందరూ, సంక్షేమనిర్మాణ కార్యాలలో అందెవేసినచేతులు. దీల్లో అతిశయోక్తి ఏమీలేదు. మదరాసులో సంఘసంక్షేమాభ్యుదయకార్యాలెలాటి ఉన్నతస్థితిలో ఉన్నవో తెలపటానికే పై ఉదాహరణలు వివరించాను.

[ యోజన- 13 నవంబరు పత్రికనుండి ]

# నరకాసుర వృత్తాంతము

శ్రీ విద్వాన్ వేదము లక్ష్మీనారాయణ శాస్త్రి, బీ.వో.యల్.

(గతసంచిక తరువాయి)

నరకనామము కూడా జనకనామమువలెనే యొక వంశబిరుదము, వాస్తవమున నరకజనక శబ్దములకు అర్థభేదములేదు. జన, నర- సబ్దములకు 'క' ప్రత్యయము చేరఁగా జనక నరక శబ్దములగును. జన నర శబ్దములు సమానార్థకములు ; కనుక జనకశబ్దము వంశబిరుదమైనట్లే నరకశబ్దముకూడ నొక వంశమునకు బిరుదనామము, కాఁబట్టి నరకుఁడు జనక వంశమువాఁడై సమానార్థక నరకశబ్దమును వంశనామముగాఁ బరిగ్రహించి యుండఁబోలును. ఇట్లది వంశనామమై ఆవంశమున జనించిన యొక్కొక్కనికిని నామాంతర మొకటి వ్యక్తిగతమై యుండినను సామాన్యముగా ఆవంశపు రాజులకు నరకులను వ్యవహారనామము ప్రఖ్యాతమైనది.*

అంతేకాదు. నరకశబ్దము బిరుదవాచ్యమనుట కింకొక ప్రబలసాక్ష్యము కలదు. హరగౌరీసంవాద మను గ్రంథమునఁ కామరూపదేశమును పాలించిన వారిలో 24, 25- మంది రాజులు నరకవంశమువారని చెప్పియున్నది.

> జననాగభరతామరజహోయథ పశ్చిలాః।
> అమసామ్యామభు గోయా ముకేశి నరకాన్వయే॥

(చూ. IHQ, 1942- వ సం॥ సెప్టెంబరు- 231పు. మొ,)

ఇచట నరకవంశపు ఇరువదినాల్గు ఇరువదియైదు మంది రాజుల పేళ్ళలోని ఆద్యక్షరములు తాంత్రికగ్రంథ సంప్రదాయము ననుసరించి పేర్కొనఁబడినవి. ఇందుఁబట్టి నరకవంశపు రాజులు 24.25 మంది దేశమును పాలించిరి; వారిలో నొక్కొక్కరును వంశనామమైన నరకబిరుదమును వహించినారనుట స్పష్టము.

ఇప్పటికి మనకు రెండువిషయములు- ఒకటి నరకవంశము రాజులు 24, 25 మంది యనుటయు- రెండవది నరకుఁడన్నది వారు బిరుదముగా ధరించుచుండిరనుటయు- కాళికాపురాణమున నరకుఁ డొక యుగాంతము పరిపాలించుచుండెనన్న వాక్యమును విశదీకరింపఁ దోడ్పడును, . కాళికాపురాణమున నరకుఁ డొకయుగాంతము పరిపాలించెనన్న వాక్యమును విశదీకరింపఁ దోడ్పడును. కాళికాపురాణమతమున నరకుఁడు (1) 28- వ త్రేతాయుగాంతమున జనించి ద్వాపరాంతమున మరణించెనన్న సంగతియు, (2) రామావతారాంతమున జనించి కృష్ణునిచే మరణము పొందెనను సంగతియు కలుపఁగా నతఁ డొకయుగకాలము పూర్తిగా- పరిపాలించెనన్నవచన మెట్లు సార్థమగుచున్నదో తెలియును. అంతమాత్రమే కాదు. రామకృష్ణావతారములమధ్య నొకపూర్ణయుగము గడచిననదని మనకిందువలన ఋజువగుచున్నది.

నరకుఁడొకపూర్ణయుగము పాలించెనను కాళికాపురాణ వచనమునకు రూఢిమైనయర్థము నరకవంశమువారు ఒక యుగముకాలము అధిపులుగ నుండి రనుటయే, కనుక హరగౌరీసంవాదగ్రంథములో నుడివినట్లు నరకవంశజులలో 24, మంది రాజులు ఒక యుగకాల ప్రమాణము రాజ్యమేలిరని భావము. ఇది సుసంగతమైనదియే, మన్వంతరచతుర్యుగగణనము* ననుసరించి 25 మంది రాజుల పరిపాలనమునకు (25 × 40॥) 1000 యేండ్లు కడచిని యుండవలెను, వేయియేండ్లొక యుగమని నిర్ధారితమైనది, కనుక కాళిపురాణహ రగౌరీసంవాదగ్రంథములోని వాక్యముల కర్థమేమన, త్రేతాయుగాంత ద్వాపరాంతముల మధ్యకాలమున నరకవంశజులు 25 మంది

---

*కాలాంతరమున నరకులను పేరు ఒకజాతినామముగాఁ గూడ పరిణమించినది. చూ. మహాభారతము సభాపర్వము, 14- వసర్గ 14- వశ్లో, "మురుంచ నరకంచైవ శాస్తి యోయవనాధిపః" అని భగదత్తునిఁ గూర్చిన శ్రీ కృష్ణ వాక్యము, దానింబట్టి భగదత్తుఁడు మురులకును నరకులకును గూడ ప్రభువనుట విదితమేగదా !

*పురాణ పంచలక్షణములలో సర్గప్రతి సర్గముల మినహాయింపఁగా శేషించు వంశము, వంశానుచరితము మన్వంతరము అనువానిలో వంశమనుదాన రాజుల పేళ్ళును, వంశానుచరితమున ఆయా రాజుల యేలుబడులలో సంభవించిన విశేషఘట్టములును విపులముగా వర్ణితములు, ఇక యుగము, మన్వంతరము, కల్పము అనుకాలమానములు మూఁడింట కేవలము మన్వంతరమును మాత్రమే యేల పురాణలక్షణములలో నొకటిగా గ్రహింపవలయును? ఇది ప్రతి రాజును పరిపాలించిన కాలమును, ఒక వంశమువారు పరిపాలించిన మొత్తముకాలమును తెల్పునది కావలయును. దీనింగూర్చి వేరొకవాసమున విపులీకరింతును.

రాజులు పరిపాలించిరని యర్థము**. అనఁగా, నరక వంశజులలో మొదటివాఁడు అనఁగా వంశమునకు మూలపురుషుఁడు— శ్రీరామరావణ యుద్ధానంతరము 28- వ- చతుర్యుగమున మహాత్రేతయందు సింహాసనాధిష్ఠితుఁ డయ్యెననియు, అదే 28-వ చతుర్యుగమున మహాద్వాపరమందు నరకవంశజులలో చివరివాఁడు శ్రీ కృష్ణనకు సమకాలీనుఁడయ్యెననియు నూహించుట సుసంగతమగును.

ఈ విధముగా నరకుని వృత్తాంతము మనకు తెలియుటతో కథయంతయు సులభముగ నవగత మగును, తొలుత ధార్మికుఁడు న్యాయపరుఁడునై యుండి యనంతర మధర్మశీలుఁడుగ పరివర్తన మందినవాఁ డొకే వ్యక్తి గాఁడు, అచట మొదటి నరకుఁడును చివరి నరకుఁడును వర్ణితులు, కనుక చివరకు నరకవృత్తాంత పరిశీలనచేఁ దేలిన యంశము లీక్రింద సంక్షేపింతును.

(1) జనక రాజునకును భూమి·యను పెరుగల దాదికిని జన్మించిన అనౌరసపుత్రుఁడు నరకుఁడు. అతఁడు కామరూపమును పాలించు ఘటకుఁడను కిరాతాధిపుని నిర్జించి యాదేశమునకు ప్రభువుగా నభిషిక్తుఁడై నరక వంశమునకు మూలపురుషుఁడయ్యెను. ప్రాచీన జనక వంశమునుండి వివేచించుకొను భావముతో పర్యాయముగా నరకశబ్దమును కల్పించుకొనెను, కాన నారెంటికర్థభేదమే మాత్రమునులేదు.

(2) నరక వంశమూలపురుషుఁడు విదర్భేశ్వరుని పుత్రి మాయాదేవిని పెండ్లియాడెను.

(3) ఈ మూలనరకుఁడు స్వయముగా కామరూపమున కధిపతియైనను తండ్రియైన జనకునితో సఖ్యసంబంధములు మానకుండినట్లును. జనకుఁడును కామరూపమున కుమారునితో మైత్రి సల్పుచు కొంతకాలము నివసించుచుండినట్లును గూడ కాళికాపురాణము వచించుచున్నది.

(4) నరకుఁడు వైదికమతానుష్ఠాన పరుఁడు. కాళికాపురాణమున,

నరకోఽపి తదా ధీమాన్ వేదశాస్త్రార్థపారగః।
బ్రహ్మణ్యో నీతికుశలో వదాన్యో దానతత్పరః॥ 38 అం152.
కామాఖ్యాపూజనరతో నీలకూటే మహాగిరౌ।
మహాభోగీ మహాశ్రీమాన్ హీనబాధశ్చ శత్రుభిః॥ 38 అ. 153.
సుచిరం రాజ్యమకరోచ్చక్రవత్ త్రిదశాలయే॥ 38 అ. 153½

ఈతీరున నతఁడు వేదములను, బ్రాహ్మణులను గౌరవించెను. వైదికధర్మపరులు పండితోత్తములునైన బ్రాహ్మణులు తన రాజ్యమున సుప్రతిష్ఠులుకాఁ బ్రోత్సహించెను.

ద్విజాతీన్ వాసయామాస తత్రవర్ణాన్సనాతనాన్।
వేదాధ్యయనదానాని సతతం వర్తతే యథా॥ 38 అ. 12

(5) నరకుడు కామరూపమున నిట్టి బ్రాహ్మణ మూలముననే దేవ్యారాధనమును నెలకొల్పఁ గలి నేమో ! దేవీపూజాప్రసరణముతో వైదిక సంస్కృతి వ్యాప్తి సమస్యయు తలయెత్తుచున్నది. అసలు విషయమ నవగాహనము చేసికొందము. నరకుఁడు జనకపుత్రుఁడ గనుక వేదాభిమాని, అట్లుండియు దేవీపూజనమునక మ్రొగ్గనేల ? దేవీపూజ వైదికోక్తము గాకున్నను నరకు డద్దానిని కామరూపమున ప్రసరింపఁజేసెను. ఏల ? ఈ విషయమున నతఁడు తన తల్లిమతమును అనుకరిం యుండునని యభిప్రాయపడవలసియున్నది. అతని తల్లి సామాన్య ధాత్రీవృత్తిని చేపట్టియుండిన కారణము సామాన్య హీనకులమునఁ బుట్టినది గావచ్చును. తత్సంబంధి సంఘమున దేవ్యారాధనము ఆచారము. తండ్రి తన్ను నిరాకరించిన క్రొత్తలో క్రోధపరవశుఁడై జనకుతోడి సంబంధబాంధవ్యములను తెగత్రెంపు చేసికొయుండవలెననుటకు నిదర్శనములు రెండు : (1) తన వంశనామమును జనకనామమును నరకాఖ్యగా మార్చు యొకటి ; (2) తదాదిగా వంశమును మాత ననుసరిం భౌమాఖ్యముగా పేర్కొనుట రెండవది. ఇందుమూమున నరకునకు జననియందెంత ప్రేమవిశ్వాసవలుండెడివో విస్పష్టము. కనుక జనని వంశమువారికి పపాటియైన దేవీపూజనమునుకూడ తాను అవలంబిం యుండును. కాని యతనితల్లి దేవీపూజాసక్తయైనం మాత్రమున అవైదికురాలని రూఢిపఱుప వీలుగాద వైదిక సంఘములోనే పై శాఖలలో మృగ్యమయిన క్రింది శాఖలలో దేవీపూజయు, నితర పూజలును ప్రబ యుండవచ్చును. ఈ విషయమును నిదమిత్థమని ని రించుట యసాధ్యకార్యము. ఏది యెట్లున్నను నరకుఁ

**ఇట్టి సందర్భముననైతము మన్వంతరచతుర్యుగవిధానమే యనుకృతమైన దనుట స్పష్టము. వాస్తవము నరకాసురుఁ డొక యుగము గాలము. జీవించె ననువాదమున కీవిధానమే ఆధారమగుట నిస్సంశయము.

దేవ్యారాధనాసక్తు(డయి కామరూపమున వ్యాప్తిచేయుచో తద్విధానమును సంపూర్ణముగ సంస్కరించియుండ( బోలును. ఏల? స్వగుణముల నేమాత్రము నత(డు వర్జింపని కారణమున, తద్విరుద్ధముగ నత(డు సదాచార సంపన్నము, వేదశాస్త్రాధ్యయననిష్ఠమునైన బ్రాహ్మణ్యమును రప్పించి తదుచితావాసముల నొస(గి యాదరించియుండుటే యిందులకు తార్కాణము. కనుక నా సంపన్నుల సాయమున దేవ్యుపాసనమును వైదిక దైవములతో సమానప్రతిపత్తినందెను.

నరకు నాగమనముతో కామరూప సంస్కృతి మేలిమినందె ననుటకు నిదర్శనాంతరము కలదు. నరకు(డాదేశమున( బ్రవేశించునపుడు కిరాతులు పరిపాలకులు. వారు సహజముగ నవైదికులు. నరకు( డాకిరాతులను సముద్రతీరప్రాంతమునకు తఱిమివేసిన యనంతరము దేశాచారమును సంస్కరించెనని కాళికాపురాణము పేర్కొను చున్నది. కనుకనే నరకు(డు కామరూపమును పాలించిన తొలి వైదికప్రభువనుటలో విప్రతిపత్తి యేమియులేదని మదభిప్రాయము.

(6) ఈ యాదినరకు(డు దీర్ఘకాలము ప్రజానురంజకముగ పాలించి దేశమును సుభిక్షవంతము గావించెను.

(7) ఇంతకు శేషించిన నరకవృత్తాంతమంతయు నరకవంశములోని చివరి పాలకుని గూర్చినట్టిది. వాస్తవమున మనమిప్పుడు సామాన్యముగ వ్యవహరించు వృత్తాంతము. తొలినరకుని చరిత్రయొక్కయు తుదినరకుని చరిత్రయొక్కయు సమ్మేళనము.

(8) ఈ చివరి నరకునకును తొలి నరకునకును గుణవిశేషములందేమి విషయపరిశీలనమందేమి హస్తిమశకాంతర భేదము గలదు. ఈ చివరి నరకునితో పరిచయమేర్పడులోపల నా వంశపురాజులు కొన్ని శతాబ్దములు దేశపాలనము కావించియున్నారు.

(9) శోణిత పురపాలకు(డైన బాణునితో* మైత్రి సల్పినవా( డీచివరి నరకు(డే.

(10) ఈ ప్రకృత బాణునుపదేశబలమున నరకు(డు దేవీపూజ త్యజించి శివారాధనము చేపట్టెను.

(11) ఈ నరకు(డు దురభిమానియు, అతిగర్వియునై ప్రజలను, అందును ప్రధానముగా బ్రాహ్మణులను, స్త్రీలను సైతము పీడించెను. ఇతని యిట్టి దుష్టచేష్టల ఫలితముగ నితనిని నరకాసురు(డని వ్యవహరింపసాగిరి. నరకాసురనామము ఆ-వంశమే యసురవంశమని సూచింపదు. ఈ పేరు కాళికాపురాణమున నెచ్చటను మూలనరకునకు పర్యాయముగా నుదాహృతము కాదు. తొలివా(డు కేవలము నరకమాత్రు(డే. కనుక నరకాసురనామము చివరివానికే సార్థకమయినట్టిది.

(12) శ్రీకృష్ణు( డీనరకాసురుని నిర్జించి చంపి యతని కుమారు(డో మనుమ(డో అయిన భగవదత్తుని సింహాసనమున ప్రతిష్ఠించెను.

ఈ కాళికాపురాణ కథనముచే మనకు నరకుల చరిత్రనేగాక కామరూప దేశచరిత్రమును యథార్థస్థితిలో నిర్ణయించుటకు వీలగుచున్నది.

* కాళికాపురాణ మీ బాణుని బలిచక్రవర్తి కుమారు(డుగా( బేర్కొనుచున్నది. దీనికి కారణము నరజని జననమును వరహావతార కాలమునకు( ద్రోసిపుచ్చి సామాన్య జనప్రవాదమును ప్రమాణపఱచుటయేయగును. కాని యెనిమిదవ యవతారమగు కృష్ణావతారకాలమున నుండవలసిన యీ బాణు(డు వరహావతార కాలమున( గూడ నెట్లుండ(గల్గును? కా(బట్టి చివరి నరకునకును, అందుచే శ్రీ కృష్ణునకును సమకాలికు(డగు బాణు(డు మహా భారత యుద్ధకాలమున నుండెననుటయు. కనుకనే యిత(డు బలి-విరోచన కుమారు(డగు బాణునికంటె భిన్ను(డనియు నిశ్చయము.

---

మాతయె బలంబు తనమేనమామగారి,
కాత్మజయె బల మల్లున, కాలు బలము
అత్తమామల కగును, నభ్యాగతునకు
నతిథికిని దానె బలము గృహస్థు(డెపుడు||

(నీలకంఠ దీక్షితులు)

# కలల పంట

## శ్రీమతి యన్. శారద

సరోజ కాఫీకప్పుతో గదిలోకి వచ్చేటప్పటికి రామం అప్పుడే బట్టలువేసుకుని తయారవుతున్నాడు.

మామూలుగా అయితే కప్పు టేబిలుమీదపెట్టి సరోజ అవతలికి వెళ్ళిపోవాల్సిందే. కాని ఆరోజు అందుకు విరుద్ధంగా ఆమె అక్కడే నిలబడేటప్పటికి రామం చికాకుగా ఆమెవంక చూచాడు.

ఆమె చూపుల్లో ఏ ప్రోపాధేయత, ముఖంలో ఏదో చెప్పుకోవాలనుకొన్న ఆతురత రామం గుర్తించలేదు. గుర్తించినా, దానికి ప్రాధాన్యత ఇవ్వదలచుకోలేదేమో! "ఇంకా నిలబడ్డావేం?" అన్నాడు కటువుగా.

సరోజ బెదిరిపోయింది!

"ఒక్క మనవి" అక్షరాలు కూడదీసుకొని మాట్లాడినట్లుంది ఆమెస్వరం.

"ఈ మనవులు, గినవులు వినటానికి నాకు టైంలేదు. నీ మనవి ఏమిటో వెళ్ళి ఆ తులసికోటకి చెప్పుకో" వ్యంగ్యంగా అంటూ రామం కాఫీ ఒక్కగ్రుక్కలో త్రాగేసి బూట్లు టకటకలాడిస్తూ గదిలోంచి వెళ్ళిపోయాడు.

ఆమె ఆత్మాభిమానం కుతకుతలాడింది! అవమాన భారంతో మనస్సు విలవిలకొట్టుకొంది! అప్రయత్నంగా ఆమె కళ్లలో నీళ్లునిండాయి. ఆ కన్నీళ్ళతో అలాగే కిటికీముందు నిలబడిపోయింది. వీధిలో చకచక నడిచి పోతున్న భర్తవంక జూస్తూ -

"ఏమిటి తను చేసిననేరం? ఎందుకు తనకీశిక్ష" ఈ ప్రశ్నలు ఆమెబుర్రను బ్రద్దలుజేస్తున్నాయి. సమాధానం చిక్కలేదు.

ఆమె కన్నీళ్ళలో మసకమసకగా రామం దూరంగా కనిపించి రోడ్డు మలుపుతిరిగేటప్పటికి అదృశ్యమైపోయాడు.

ఆమె కిటికీముందు ఎంతోసేపు నిలబడలేకపోయింది. ఆమె ఆలోచనలలో సత్తువ కరిగిపోయిందేమో! కాళ్ళు తేలిపోతున్నట్లయి మంచంమీద చతికిలబడి చేతుల్లో ముఖం దాచుకుంది.

దుఃఖం పొర్లుకొస్తూన్నది! ఎవరైనా వింటారేమోనని అది పైకిరానీయకుండ మింగేస్తున్నది సరోజ.

కొన్నిక్షణాలు గడిచాయి!

"సరోజా!" గదిముందు అత్తగారిగొంతు.

పమిటచెంగుతో కళ్ళు తుడుచుకొని సరోజ లేని నవ్వును తెచ్చుకొని, "ఏమిటత్తయ్యా" అంటూ బయటికి వచ్చింది,

"అబ్బాయి వీధిలోకి వెళ్ళినట్లున్నాడు! ఉత్తరం సంగతి చెప్పావా?" అంది అత్తగారు.

"లేదత్తయ్యా... రాత్రికి చెబుతాను" అంటూ తల దించుకొంది.

"సరే- స్నానంచెయ్యి- చూడు ఎలావున్నావో?" అని అత్తగారనేటప్పటికి సరోజ అక్కణ్ణించి వెళ్ళిపోయింది.

x x x

దీపాలు వెలిగాయి. సరోజ జడవేసుకొంటూ గదిలో కూర్చుంది. యాంత్రికంగా పనులు చేసుకుపోతున్నదేగాని మనస్సులో ఏదో అందోళనపడుతున్నది.

భర్త తనపట్ల ఇంత నిర్దయగా ఎందుకుంటున్నాడు? తనుచేసిన అపరాధమేమిటి?" ఉండిఉండి ఈ ఆలోచనలే ఆమెలో చెలరేగుతున్నాయి.

తనతో మనసిచ్చి మసలకపోయినా, ఒక్కమంచి మాటకోసం, చల్లనిచూపుకోసం, ఒక్క చిరునవ్వుకోసం తానెంత తహతహలాడుతున్నదీ ఆయన గుర్తించరేం? తోడునీడ సర్వస్వం తనేఅని నమ్ముకున్న భర్త తనను చూస్తేనే చిరాకుపడుతూ, తనమాటంటేనే కసిరికొడుతూంటే, తను పడుతున్నవ్యధ ఇంకెవరికి చెప్పుకోవాలి? కాపురానికి వచ్చిన ఆ నెలరోజులనుంచి ఎడముఖం పెడముఖంగా వుంటున్నా, అది పైకి పొక్కకుండా తను మసలుకొంటున్నది. ఇట్లా ఎన్నాళ్ళు జరుగుతుంది. జడ అల్లుకోవటం పూర్తిచేసి అద్దంలో ముఖం చూసుకొంటూ ముంగురులు సవరించుకొంటున్న సరోజదృష్టి ప్రక్కనేవున్న రామంఫోటోమీద పడింది. "ఫోటోలోని చిరునవ్వు చూసే తాను సంతోషపడాలేమో" అనుకుంది. మనస్సును ఈ ఆలోచనలనుండి మళ్ళించడానికనేమో భాగవతగ్రంథం తెరిచింది. కాని, మనస్సు దానిమీద లగ్నం అయితేనా?

"తనేంచేస్తే ఆయనకు సంతోషం కలుగుతుంది?" అని ప్రశ్నించుకుంది.

అంతచదువుకున్నతను, పెద్ద ఉద్యోగంలోవున్నతను తనకి భర్తగా లభించడం తన పూర్వజన్మసుకృతమే

అని పొంగిపోయిన సరోజ భర్తప్రవర్తన చూసి క్రుంగిపోయింది. "తను చేసినపూజలకి, నోచిన నోములకి ఫలితమిదేనా? తనుకన్న కలలపంట ఇంతేనా? అతని చల్లనిచూపులలో కాలంగడిపే అదృష్టం తనకి లేదా? అనుకుంటూ చేతిలోని భాగవతాన్ని టేబిలుమీద పెట్టేసి వెక్కి వెక్కి ఏడవసాగింది.

ఏడ్చిఏడ్చి ఒంట్లో సత్తువంతా పోయింది. శరీరం తూలిపోతోంది. తనబాధ ఎవరితో చెప్పుకొంటుంది? భారతస్త్రీలు భర్తఅనురాగం పొందలేనప్పుడు ఏడవటం కన్న ఏం చేయగలరు? అటు కన్నవారు ఇటు అత్తవారు కూడా తమదాంపత్యం చూసి మురిసిపోతున్నారే? ఈ తెరవెనుక నాటకం ఎవరికి తెలుసు? "నిజమే! ఆయనన్నట్లు నాబాధ తులసికోటకే చెప్పుకోవాలి" అనుకుంటూ గదిలోంచి గబగబా వచ్చేసి, తులసికోటదగ్గిర కూర్చుంది. ఏమని మనవిచేసుకుందో ఆ తులసెమ్మకు చేతులెత్తి నమస్కరించింది.

ఇంతలో టకటక బూట్లచప్పుడుతో రామం ఇంట్లో ప్రవేశించాడు. సరోజ లేచి గదిలోకెళ్ళింది. ఏదో తెలియని భయం ఆమె మనస్సు నావరించింది. "ఏం ఘర్షణ జరుగుతుందో? ఇంతవరకు సాఫీగా నడచిపోతున్న ఈ ఇంట్లో ఏం అనర్థాలు జరుగనున్నాయో; ఈ ఉత్తరం కూడ ఇప్పుడే రావాలా?" అనుకుంటూ క్రుంగిపోతోంది.

కాళ్ళు చేతులు కడుక్కొని భోజనంముందు కూర్చున్నాడు రామం. సుందరమ్మగారు నెయ్యి వడ్డిస్తూ, "రామం! మీ మావగారు ఉత్తరం వ్రాశారురా. అమ్మాయిని పంపించి ఆరునెలలయింది. ఓమారు చూడాలని వుంది. ఇద్దరూ వచ్చి నాలుగు రోజులుండి వెళ్ళమని. వారికిమాత్రం ఒక్కగా నొక్కకూతురు. వెళ్ళిరండి నాన్నా" అంది. కూర కలుపుకుంటున్న రామం ఒక క్షణం అలాగే ఆగిపోయాడు. "నేను వెళ్ళను. దాన్ని కావాలంటే పొమ్మను" అన్నాడు. ఈ మాటలకు సుందరమ్మ మొదట కొంచెం ఆశ్చర్యపడినా "సిగ్గుపడుతున్నాడేమో" నని "ఎంచేత వెళ్ళవురా? నువ్వంటే ఎంత ఇష్టం అనుకున్నావ్ మీ మామగార్కి. కొడుకువైనా నీవే, అల్లుడువైనా నీవే అనుకుంటూ ప్రాధేయపడుతూ వ్రాశారురా" అంటూ ఇంకా ఏదో చెప్పబోతున్న తల్లిమాటలకడ్డొచ్చి, "అమ్మా నన్ను చంపకు. నేను వెళ్ళను. దాన్ని పంపించు. మళ్ళీ దానిముఖం నాకు చూపెట్టక్కర్లేదని చెప్పు" అంటూ గబగబా పులుసు పోసుకొని కలుపుకుంటున్నాడు రామం.

సుందరమ్మగారు కొయ్యబారిపోయింది. ఇన్నాళ్ళు అబ్బాయిప్రవర్తన చూసి, సిగ్గేమో, ఇంకా నాల్గురోజులు పోతే అదే పోతుంది, అనుకుంటున్న ఆమె హృదయంలో బాణంలా దూసుకుపోయాయి రామం మాటలు. తలుపు చాటున నిలబడి ఇదంతా వింటూన్న సరోజ వెక్కివెక్కి ఏడుస్తోంది.

మజ్జిగ వడ్డిస్తున్న సుందరమ్మ మళ్ళీ అందుకొని, "అది చేసినతప్పేమిటిరా? ఎందుకదంటే నీకంత కోపం?" అని అడిగింది. "నన్నెందుకిలా వేధిస్తారమ్మా, 'ఓ' అంటే 'న' రాని మొద్దుమొహాన్ని అంటగట్టి నా జీవితాన్నే నాశనంచేశారు. ఫలానా ఆఫీసరుగారి భార్యకు చదువురాదంటే ఎంత చిన్నతనమో చూశారా? పెళ్లి నిశ్చయంచేశామని, ముహూర్తంకూడ పెట్టేశామని- పిల్లను చూడటానికి టైంలేదు; కాబట్టి ఫోటో పంపిస్తున్నామని వ్రాస్తే, ఫోటో చూసి చదువుకున్న అమ్మాయి వలెనే వుందనుకున్నాను. కాని ఇంతలో ఇంత అన్యాయం జరుగుతుందనుకోలేదు. ఇంతకీ నాఖర్మ" అంటూ కంచంలో చెయ్యికడుగుకొని వెళ్ళిపోయాడు రామం.

తలుపుచాటునుండి ఈమాటలు విన్న సరోజ ఇక దుఃఖాన్నాపుకోలేక మంచముమీద వాలిపోయింది.

అప్పుడే ఇంట్లో అడుగు పెడుతూన్న సుబ్బారావుగారు కొడుకు మాటలు విని ఆశ్చర్యపోయారు. సుందరమ్మగారికి వొళ్ళుమండిపోయింది.

ఇన్నాళ్ళూ రామం ప్రవర్తనగురించి మాటమాత్రమయినా తనతో చెప్పకుండా లోలోపలే కుమిలిపోతూన్న సరోజ సహనానికి ఆశ్చర్యపోయింది సుందరమ్మ. ఇటువంటి ఉత్తమురాలు తనకు భార్యగా దొరికినందుకు సంతోషించక, చదువుసంధ్యలు రావని తృణీకరిస్తున్న రామంమీద ఒళ్ళు మండిపోయింది. ఇంతకన్నా కావలసిందేమిటి? చదువుసంధ్యలంటే ఇంగ్లీషు ముక్కలేనా? సరోజ చక్కగా పురాణాలన్నీ చదువుతుందే తీరిక వేళల్లో. అది చదువుకాదా? దానికి విలువలేదా? నాలుగు ఇంగ్లీషుముక్కలు మాట్లాడుతూ పదిమందితో చేతులూపుకుంటూ, భర్తనీ, అత్తమామల్నీ లెక్కచెయ్యకుండ తిరిగేవాళ్ళేనా చదువుకున్నవాళ్లు? మంచితనానికి చోటేలేదా? పాపం! సరోజ ఎంత కుమిలిపోతోందో!" అనుకుంటూ వెళ్ళి, మంచంమీద పడుకుని వెక్కివెక్కి ఏడుస్తున్న సరోజతలను ఒళ్ళోకి తీసికొని "ఏడవకమ్మా,

నా కంఠంలో ప్రాణం వుండగా నీ కన్నీళ్లు చూళ్లేను. వాడికి బుద్ధిచెప్పాలి. ఊరుకో తల్లి."

x x x

రామం వెళ్ళనంటే వెళ్ళనని పట్టుపట్టడంవల్ల సరోజను పుట్టింట్లో దింపడానికి సుబ్బారావుగారే స్వయంగా వెళ్ళవలసివచ్చింది. భర్తనువిడిచి వెళ్ళాలనేబెంగ, పుట్టింటికి వెళ్తున్నాననని సంతోషమూ. ఈ రెండింటితోనూ సతమతమౌతున్నది సరోజ.

ఇంటిముందు రిక్షా వొచ్చి ఆగింది. సామానంతా ఒకరిక్షాలో ఎక్కిస్తున్నారు సుబ్బారావుగారు. సరోజ ఏడుపును దిగమ్రింగుకుంటూ వెళ్ళి రామం పాదాలకి నమస్కరించి "వెళ్ళొస్తానండీ" అంది కన్నీళ్ళు తుడుచుకుంటూ.

"ఊ...." అన్నాడు ముక్తసరిగా రామం.

"సరోజా! రైలువేళయిందమ్మా" అని కేకవేసిన మామగారి పిలుపు విని, ఎదురుగా గోడమీద కనబడుతూన్న శ్రీ వెంకటేశ్వరస్వామి ఫోటోకి, తన కోరికలు తీర్చమని, మనస్సులో వెయ్యిదండాలు పెట్టుకొని, వెళ్ళి రిక్షాలో కూర్చుంది సరోజ.

రైలుబండి అతివేగంగా పోతోంది గుంటూరునుండి విజయవాడకు. దాంతోపాటే సరోజ మనస్సులో ఆలోచనలుకూడ పరుగెత్తసాగాయి. ఉన్నట్టుండి ఒక చక్కటి ఆలోచన మెరుపులా మెరిసింది. వెంటనే "మామగారూ" అంది. "సరోజ బ్రతుకు ఎలా చిగురిస్తుందా? తన కొడుకుప్రవర్తన ఎలా మారుతుందా?" అని ఆలోచిస్తున్న సుబ్బారావుగారి ఆలోచనలకి ఒక్కసారిగా బ్రేకు పడింది. "ఏవమ్మా" అన్నారు. "నన్ను ఒక్క సంవత్సరం అమ్మా వాళ్ళదగ్గిఱ ఒదిలివేయండి. నేను ప్రైవేటుగా స్కూలుఫైనల్ పరీక్షికి కడతాను. పరీక్షలయిపోగానే ఒచ్చేస్తాను" అని జాలిగా అడుగుతూన్న గొంతు వినేటప్పటికి సుబ్బారావుగారిక్కూడా కళ్లలో నీళ్లు తిరిగాయి. గొంతు బొంగురుపోయింది. అతికష్టంమీద "నీ ఇష్టమమ్మాయి" అన్నారు. ఆనందంతో సరోజ ముఖం వికసించింది. మనస్సులో అనేక దేవుళ్ళకి దండాలుపెడుతూ, తన భవిష్యత్తునుగురించి ఆలోచించ సాగింది సరోజ.

x x x

రైలు విజయవాడ చేరింది. కూతుర్ని అల్లుణ్ణీ తీసుకుర్వావటానికి స్టేషనుకు వచ్చారు జగన్నాధంగారు. కానీ అల్లుడుగారెక్కడా కనబడకపోయేటప్పటికి, ఆయనగారికి ఏంకోపం వచ్చిందోనని "రామం ఏడమ్మా?" అని అడిగేసరికి "ఆఫీసులో సెలవు దొరకలేదు నాన్నా రాలేకపోయినందుకు ఎంతో విచారించారు" అని స[...] చెప్పిన సరోజ తెలివితేటలకీ, తన గౌరవాన్ని కాపా[...] నందుకు, ఎంతగానో సంతోషించారు సుబ్బారావుగారు

స్నానాలు, భోజనాలు అయిన తరువాత రామం ఏదో ట్రైనింగుకోసం డిల్లీ వెళ్ళుతున్నాడనీ, ఈ సంవత్సరం పాటు తను అక్కడ ఊరికే కూర్చోటంకంటే ఇక్కడే వుండి స్కూలుఫైనల్ పరీక్ష కట్టదలచు"కొన్నాననీ చెప్పింది సరోజ. తమ ఇంటిగుట్టు బయటపెట్టకుండా, తనభర్తసంగతి తన తల్లిదండ్రులతోకూడా చెప్పకుండా, ఎవ్వరి మనస్సు కష్టపెట్టకుండా, తనే లోలోపల కుమిలి పోతూ, పైకి సంతోషంగా కనబడే సరోజ సుబ్బారావుకి దేవతలా కనబడింది.

ఇంత సహనం, ఇంత ఓర్పూ, ఈరోజుల్లో ఎవరి కుంటాయి? వెధవ ఇంగ్లీషు ముక్కలు రావని, లక్ష్మీ దేవిలాంటి పిల్లమనస్సు గ్రహించుకోలేక బాధపెడ్తున్నాడు. వాడికెప్పుడు బుద్ధొస్తుందో అనుకొంటూ నిట్టూర్చాడు.

రెండు మూడు రోజుల తరువాత తనకూళ్లో ఎన్నో పనులున్నాయని చెప్పి, తన ఊరికి ప్రయాణమయ్యారు సుబ్బారావుగారు.

x x x

రామానికి నిద్రపట్టక ప్రక్కమీద దొర్లుతున్నాడు. విసుగ్గాలేచి గడియారంవంక చూచాడు. పన్నెండవుతోంది. ఏమిటో మనస్సు సరిగ్గాలేదు. ఎందుకో సరోజ పదేపదే జ్ఞాపకంవస్తోంది. సరోజకి తను అన్యాయం చేశాడు. చదువురాదన్న విషయంతప్ప మిగిలిన విషయాలన్నింటిలోనూ సరోజ అసమానురాలు. పాపం! ఎంత కోప్పడినా ఒక్కసారైనా ఎదురుచెప్పేది కాదు. పైగా అమ్మమీద ఎంత అభిమానం. అమ్మకికూడా సరోజంటే ప్రాణం. అంచేతే కాబోలు సరోజ పుట్టింటికి పోయింది మొదలు, అమ్మ నాతో సరిగా మాట్లాడటంలేదు అనుకున్నాడు.

ఎదురుగా గోడమీద తన పెళ్లినాటిఫోటో కనబడింది. "అబ్బ! సరోజ ఎంత అందంగా వుంది. ఆ చిరునవ్వు, ఆ కాటుకకళ్లూ, తనను పలుకరిస్తున్నట్లు కనబడుతున్నాయి. ఆ మోహంలో అనురాగము, అమాయకత్వం ఉట్టిపడుతున్నాయి." ఆ ఫోటో చూస్తున్నకొద్దీ రామం పిచ్చివాడై పోతున్నాడు. "సరోజా! నీకన్యాయం చేశాను. నన్ను క్షమించు సరూ! నీవు లేకపోతే ఈ ఇంట్లో

నేనుండలేను. నన్ను క్షమించు సరూ!" అంటూ ఆవేశంతో ఆ ఫోటోని గుండెకద్దుకున్నాడు. అర్ధరాత్రి వరకు పిచ్చిపిచ్చి ఆలోచనలతో గడిపిన రామం తెల్లవారుఝామున ఎప్పుడో నిద్రపోయాడు.

నిద్రలోకూడ సరోజ దీనవదనం కనిపించింది. ఆవేశంతో "నన్ను క్షమించు సరూ!" అని లేచిన రామం నుదుటికి మంచంకోడు కొట్టుకొని మెలుకువొచ్చింది. దెబ్బతగిలినచోట బొడిపికట్టి, నొప్పిగావుంది. రాత్రంతా నిద్రలేకపోవడంవల్ల కళ్ళంతా ఎర్రబడ్డాయి.

తెల్లారి లేచి మొహం కడుక్కొంటున్న రామం, సరోజ ఎందుకు రాలేదో తల్లి నడగాలనుకున్నాడు. కానీ తీరా దగ్గరికెళ్ళేసరికి సిగ్గుతో, ఊరుకునేవాడు. "పోనీ సరోజకి ఉత్తరం వ్రాస్తే? సరోజ తనను క్షమిస్తుందా?" ఇలాగే ప్రతిరోజు రాత్రీ గడిపేవాడు.

మనిషి ఎదుట ఉన్నంతసేపూ వారివిలువ తెలుసుకోలేరు మనుష్యులు. తీరా దూరమయ్యేసరికి వ్యధపొందుతారు.

రామం మానసికంగా బాధపడ్తున్నాడు. ఆఫీసుకి వెళ్ళినా, ఇంట్లోవున్నా సరోజరూపమే కళ్ళకు కట్టినట్లు కనపడుతోంది. తను సరోజ కన్యాయం చేశాడు అనే భావం అతనిలో జీర్ణించుకుపోయి రంపపుకోత పెడుతూన్నది.

ఆరోజు సాయంత్రం రామం ఇంటికొచ్చేసరికి తన టేబిలుమీద ఉన్న కవరుమీద అతనిదృష్టి పడింది. దానిమీద గుండ్రంగా వ్రాసిన అక్షరాలు అతనిని ఆకర్షించాయి. వెంటనే చింపి చదివి ఆశ్చర్యపడ్డాడు. "సరూ ఎంతచురుకైనదీ! ఆరునెలలలోనే చదివి మెట్రిక్ పాసయింది. ఉత్తరం ఇంగ్లీషులో ఎంతచక్కగా వ్రాసింది. తనని వొచ్చి తీసికెళ్ళమని ప్రాధేయపడుతూ వ్రాసింది. తనకోసం ఇంగ్లీషు నేర్చుకుంది" అని పొంగిపోయాడు రామం. ఉత్తరం సంగతి తల్లికి చెప్పి, ఆ మరునాడే ప్రయాణమౌతానన్నాడు. కొడుకులో ఈ మార్పు చూసి మురిసిపోయారు సుందరమ్మా, సుబ్బారావుగారూను. ఇదంతా తమ కోడలి అదృష్టమని పొంగిపోయారు.

x x x

వొస్తారో, రారో అని దిగులుగా కిటికీదగ్గర నిలుచుని, ఏదో ఆలోచిస్తున్న సరోజ, సూటుకేసు తీసుకుని గబగబా మెట్లెక్కి వొస్తూన్న రామాన్ని చూసి, ఆనందంతో ఎదురుగావెళ్ళి చేతిలోని సూటుకేసు అందుకుంది. అల్లుడిరాకని వంటింట్లోంచి సుభద్రమ్మా, పెరట్లోంచి జగన్నాధంగారూ ఆత్రంగా వొచ్చారు. కుశలప్రశ్నలయ్యాక, స్నానంచేసి భోజనాలముందు కూర్చున్నారంతా. సుభద్రమ్మగారు వొడ్డిస్తున్నారు. సరోజ ప్రక్కగా నుంచుని రామంవొంకే చూస్తోంది. మధ్యమధ్య రామం కూడా, సరోజవంక చూసి నవ్వుతున్నాడు. "ఈ చిరునవ్వుకోసం, తనెన్నాళ్ళు కాచుకు కూర్చుంది. ఇన్నాళ్ళకి ఆ భగవంతునికి తనపై కరుణకలిగింది. ఇదే తన కలల పంట. పూజాఫలం" అనుకుంటూ నవ్వుకుంది సరోజ.

భోజనాలయిన తరువాత, చేతులు కడుక్కొని, సరోజ అందించిన తువ్వాలుతో చేతులు తుడుచుకుంటూ మంచంమీద కూర్చున్నాడు రామం. వెనకనే వొచ్చి, తమలపాకులు, చిలకలు కట్టియిస్తూన్న సరోజవంక చూసి, "నన్ను క్షమించు సరూ! నిన్ను అన్యాయంగా కష్టపెట్టాను" అంటూ ఆమె రెండు చేతులూ పట్టుకున్నాడు రామం.

"తప్పు! అలా అనకండి. మీరే నన్ను క్షమించాలి. మీకు చెప్పకుండా ఇన్నాళ్ళుండిపోయాను" అంటూ అతని చేతుల్లోకి వాలిపోయింది సరోజ.

ఇద్దరి కళ్ళలోనుండి ఆనందాశ్రువులు రాలి వారి హృదయాల్ని పవిత్రంచేశాయి.

"నువ్వు పరీక్ష ప్యాసయినందుకు ఈ రిస్టువాచీ బహుమతిగా తెచ్చాను సరూ....మరీ....నాకేమిస్తావ్?" అన్నాడు రిస్టువాచీ ఆమెచేతికి పెడుతూ.

"నేనుమాత్రం మీరు కోరినప్రకారం నా స్కూల్ ఫైనల్ సర్టిఫికేటును కానుకగా ఇచ్చుకుంటున్నా" కిలనవ్వుతూ అంది సరోజ.

ఆ మాటలు తనను దెప్పుతూన్నట్లు భావించి, ఓ క్షణం ఆమె కళ్ళలోకి చూశాడు. కానీ ఆ భావం కనిపించకపోయేటప్పటికి, "నాకవ్వేమీ అక్కర్లేదు సరూ! నువ్వే నా కానుకవి. ఇంక ఈ జన్మలో ఎడబాటు సహించలేను సరూ" అంటూ ఆమెను దగ్గరకు తీసుకున్నాడు.

సరోజ కలలు ఫలించినందుకు మురిసిపోతూ, అతని చేతులలోకి వాలిపోయింది.

# ఆఁడుబ్రతుకు

అదినిశీథము; ప్రేవులఁ గెదకుచలికి,
ఉలికి కాబోలు సత్వమ్ములులుక పెదవిఁ
గఱచి విధిలేక నిదురించె! కాలపురుషుఁ
డదయుఁడో నేమో! పేదలయెద లగల్చె. 1

ఆమహాకాళరాత్రి శంపాభయైన
ఒకమనోహరసుందరి యొంటిపాటు
వెన్నుదన్నగ; ముసుఁగిడి, యున్నబలము
సన్నగిల వీధివెంబడిఁ జనుచునుండె. 2

చిదికి విరవిరవైపడు బ్రదుకులుండు
పల్లె, యాపల్లెలో నొకపాడుబావి,
బావి పరితప్తహృదయుల దీవి; యందు
నెందు దుస్సహపరితాప మెదురులేచు, 3

అందులకె నాకు సందేహ మాత్మలోని
శంక వంకలనెన్నుచు జాలిపడుచు
నన్ను పురికొల్ప నామగనాలి జాలి
యడుగఁదలఁచితి నోదార్పఁగడఁగి, వెనుక. 4

అల్లనల్లన నడువ నాయతివమదికి
దోచెనోయేమొ? నిలిచె; నుద్దులకురోసి
ఆమెగుండెలలోతుల నార్ద్రభావ
మేమొ! కనుగొనశక్యమా! యామెఁజేరి 5

అమ్మ! నీవెవ్వ రెందుకీయార్తి? యిట్టు
లీనిశీథిని వీధులనేగుటకు — వి
చారముద్రల ముసుఁగిడిసాగుటకు — వి
వేకవతి! చెప్పజాలవో? వినఁదలంతు. 6

అనఁగ బెనఁగొనుతలఁపుల- నదరి బెదరి
చెదరి — చేటలచెరగిన జీవనముల
కటికకష్టాలసుడులలో — కాలుజారి
యలమటలఁబొందు నామె యిట్లన్నదపుడు: 7

ఎందుకీజీవితమ్ము? నీవెందుకిట్లు
కనికరింతు?- కాలినకట్టె నెంచు
పరముదుండునె? యుండినఫలమె? యన్న!
నన్ను నాత్రోవఁబోని మ్మనాథనాథ! 8

మలినగాథలఁ దడవి నీమనసుఁజెరుప
దలఁచుపాపిని గాఁజాల- తనువు — మనువు
బరువులై నన్ను వంచించె- పాడువడిన
బావినైతిని నాదుజీవనమె రోత. 9

అదిగదో! కానరాదేమొ! యామహాభ
వంతి మాయిల్లు- అందుసంపదలు కొల్ల
లవి మదార్తికి మూలములయ్యె- నయ్యొ
మృదులసుమములె కంటకసదృశములట! 10

నన్ను వలచినదందు లేదన్న! నింకఁ
జెప్పవలసిదేమున్న దిప్పటికిని
బ్రదుకవలెననునాశ నన్నట్టి నిలిపె
నంతె; ననుఁనిల్పఁబోకుమన్నా, క్షమింపు. 11

దినిము నొకవార్తగా నన్నుఁదిట్టుకొన్న
పతిపరీరంభణాదులు- ప్రాయికములు
జోలిబోలేను, పోకున్నచో- ననంత
శక్తులుద్వేలమై నన్ను జంపుఁ, గాన 12

బేలనై గోలనై వ్రాలి- వాలకముల
మరులు రాఁబట్ట- మగనికై - మరగిపోయి
విరిగిపోయితి ప్రాణమే సురిగిపోయె;
కరుగడాతడు; వాడొక గండశిలయె. 13

వానికళ్యాణగుణము లవ్వారిగాఁగ
విలయతాండవమొనరించె — విఱ్ఱవీఁగె
అందుకై చింత; కొంపలే యంటుకొన్న
పేలగింజల కెవ్వఁడువ్వీళ్ళు గొనును; 14

సుట్టలేకున్న- చుట్టాలఁ జూడకున్న
చురుకుఁజూపుల మగనాండ్రఁ జూచి- వాచి
పోవకున్నను- సారాయిద్రావకున్న
నిద్దురేరాదు; నను గ్రుద్దిగ్రుద్ది చంపు; 15

ఒకఁడు పదివేలమందిగా సకలశుభము
లొడిసి గుప్పిటఁ బెట్టుకో నుడికినాఁడు;
నేనుకోరగానిదాన, నీయాన వాఁడు
అలుకచలపెట్టె; నేను చావలయు నిపుడె. 16

అనుచు నెలుఁగును దిగమ్రింగు నతివహృదయ
కుహరములు పొట్టుపొరలయ్యె,— కుమతి చెలిమి
నింతవంతల కుములు నాయింతి చావ
కెట్టులీపాడులో కాన తట్టుకొనును? 17

అమ్మ! నీవచియించినదంత నిజము
లౌట యబ్బురమా- యిటు కోటికోట్ల
మంది అదయతచేతనే క్రమందినారు;
ఊరడిల్లుము; బ్రదుకు నవ్యోర్మిసరసి! 18

కనలఁగానేల కారుకర్కశులపైన?
చావఁగానేల దురుసువంచనలకొఱకు?
యెదలపండింపఁజాలెడు పదిలమున్న
మూర్ఖులేమిటి? జ్ఞానులే మ్రొక్కఁగలరు. 19

అనుచుప్రాధీయపడి యెట్లో యాపితామె,
నెంతలైనవి బాధ లీయిలఁగలట్టి
బండరాలకు శుభములు వలచువారు
పండవలె నెండవలెగాక బ్రదుకరాదు. 20

వె. సి. వి. రె

# వాసవదత్త

## శ్రీమతి దీదువాను బదరీనారాయణమ్మ

'భవతి భిక్షాందేహీ !' అంటూ బౌద్ధ సన్యాసి ఉపగుప్తుడు అక్షయపాత్ర చేతబట్టుకొని మెల్లెక్కుతున్నాడు. కిటికీలోనించి తొంగిచూచి వీధి గుమ్మంలోకివచ్చి రిక్తహస్తాలను జోడించి, ఒక యువతి నిశ్శాంత హృదయంతో నిమీలిత నేత్రాలతో నిల్చొని భిక్షను స్వీకరించమనింది. ఆమెది రిక్తహస్తాలుకావు. ఆ దోసిలిలో అమూల్యమైన పదార్థం అదృశ్యరూపంలో వుంది. అది ఆమె హృదయానికి తప్ప అన్యులెవ్వరికీ తెలియదు. ఆమె నవయౌవనలావణ్యవతి, షోడశకళాపరిపూర్ణగాత్రి, చకోరాక్షి. వాసవదత్త. ఉపగుప్తునిరూపం అనుశ్రుతమైన ప్రకృతిసైసర్గికం, చకోరాలు అందుకోలేని చంద్రబింబం. మబ్బుల్లో దాక్కున్నా చంద్రుడు మనసులనాకర్షించుకుంటాడు; చకోరదృష్టులకు మేఘాలు అడ్డురావు. ఉపగుప్తుని కాషాయవస్త్రాలు కమండలం, చంద్రుణ్ణి కప్పిపుచ్చిన మబ్బులల్లె అడ్డు వస్తూవున్నప్పటికీ, మేఘ సంచలనాలలోంచి తొంగిచూస్తున్న శీతాంశుని మల్లె అతని దివ్య కళాశోభను మందస్మితవదనాన్ని చూచిన చకోరాక్షులు హిమబిందువుల కాశించక మానరు. అయితే వారి మనోరథం నెఱవేరుతుందా? అతడొక సర్వసంగ పరిత్యాగియైన ఆత్మసన్యాసి. సర్వసంగ పరిత్యాగికి సంపూర్ణ లావణ్యవతికీ సంఘటన కూర్చాలంటే ఎవరితరం? సహస్రాక్షునకైనా తరంకాదు. అజ్ఞానపు చూపుల కతడొక బిచ్చగాడు. ఆంతరికపు చూపుల కడడొక దిగ్విజేత అయిన సమ్రాట్టు. అతని రాజ్యం హృదయం, పరిచారకులు అరిషడ్వర్గాలు. ఆ బౌద్ధసన్యాసి చూపులను ఆమె హస్తకంకణముల ఝణఝణత్కారాలు ధగద్ధగాయమానాలు లోభపుచ్చి ఆకర్షింప చేసుకోనలేకపోయాయి. "అదేమిటి! ఆ కాంచన కంకణాలతో నాకేం నిమిత్తం? 'భవతి భిక్షాందేహీ' యని పొట్టకూటికి కొంగుపట్టి 'సత్రే భోజనం మఠేనిద్ర'లతో సంతృప్తులౌతున్న మా బోటి సన్యాసులకి?" అని ప్రశ్నిస్తాడు ఉపగుప్తుడు. "అదేమిటండీ! ఎంతటి తపోనిష్ఠాగరిష్ఠులకైనా లభ్యం కానేరని హృదయప్రేమను నా దోసిలినింపి భిక్షగా యిస్తున్నాను. సినీపాటలో 'గుత్తివంకాయకూరలో ప్రేమ పోస్తే', నేను నా దోసిలిలో పోసి యిస్తున్నాను. సినీమాలో ఒక సామ్రాజ్ఞి అవాలని వాంఛచే పెనగులాడుతుంటే, నీ హృదయ సామ్రాజ్యంలో మూడు క్షణాలపాటు నూగింజంత తావియ్యమంటున్నాను. నిశ్చలమైనప్రేమ, నిర్మలమైనప్రేమ, రారాజులకు కూడా లభ్యముకానిప్రేమ, అప్రయత్నంగా లభ్యపడుతుంటే "పనసపండుకోసి పళ్లెంలో పెడితే, తినలేని బ్రాహ్మడు దిక్కుదిక్కులు చూచా"డన్నట్లు యింత అమాయికత్వ ముంటుందా? కాలవిలంబన చేయక యీ దివ్యసౌధంలో మీదేదివ్యమాన విగ్రహాన్ని ప్రతిష్ఠించాలని వుంది. యిందండి పట్టండి, భిక్ష" అంటూ పరిపరివిధాలవాపోయింది వాసవదత్త." అతనిదృష్టుల కామె యొక పిశాచిలా ప్రతిబింబించింది. అంతే ఆమె అన్నమాటల కర్థం గ్రహించలేని ఆత్మసన్యాసి, అయోమయంలో పడిపోయాడు. అప్పటి సంఘటన తప్పించుకోవడమే అతనికొక కర్తవ్యంగా తోచింది. "ఐతే ఇప్పుడుకాదు. తిరిగి వస్తా"నన్నాడు. "ఇప్పుడు కాకపోతే మరెప్పుడు?" "సంవత్సరం గడచినమీదట" అంటూ తొట్రుపడుతున్న అడుగులతో తొందర తొందరగా మఠానికి మరలినాడు. అమ్మయ్యా ! యీ రోజున నేనొక దిగ్విజయాన్ని సాధించానని సంతుష్ట హృదయంతో శాకీ పరచుకుని సన్నని కునుకుతీశాడు. ఆశాప్రేరిత హృదయంతో అందని పండుకోసం ఆ దోసిలిని ఆలాగేచాపి, అశ్రుపూరిత నేత్రాలతో ఆలాగే చూస్తూ, స్తంభానచెక్కిన బొమ్మలా, ఆలాగేనిల్చుంది వాసవదత్త.

ప్రతిజీవరాసికి జీవితలక్షణ మింతమాత్రానిదే అని ప్రబోధన చేస్తోందా. అన్నట్లుగా సంధ్యారుణకాంతులు నలుదిక్కుల నొక్కపర్యాయం ప్రసరింపజేసి అస్తాద్రిని క్రుంకాడు సూర్యనారాయుడు. శీతాంశుడుదయోన్ముఖుడైనాడు. పండువెన్నెల పిండారబోసినట్లుంది. కలరవంతో సదా, నీరావన్యస్థలిని పవిత్రం చేస్తూ ప్రవహిస్తోంది. భిక్షావృత్తిలోనుంచి నివృత్తుడై ఉపగుప్తుడు వన్యమార్గాన్నుండి మఠోన్ముఖుడై పోతున్నాడు. మార్గమధ్యాన క్షుధాకులమయిన వ్యాఘ్రానికతడు ఆహారమవబోతున్నాడు. ఐతే అతని హృదయంలో ఆ వ్యాఘ్రమువిషయంలో వ్యతిరేక భావానికి బదులు అనుకూలభావమే ఉంది 'భక్షించేవారిని రక్షించ'మని బౌద్ధమత సిద్ధాంతం, అది అతని గురువాజ్ఞ, ఐతే. తన ప్రాణంకంటె తీపైనవస్తువు ప్రపంచ

కంలో ఏదీ వుండదు, అంత ఆత్మనిగ్రహం సంపాదింప కల్గిననాడు ఆభగవంతుడే కనిపెడతాడు. సాధుజన సంతాపం కలుగనీయడు. అంతలో అకస్మాత్తుగా ఒక అమ్ము వచ్చి ఆశాప్రపూరితమయిన వ్యాఘ్రానికి తగిలింది. అమ్ము వెంట కిరాతుడుకూడా ప్రత్యక్షమవుతాడు. ఉపగుప్తుని నిష్కాపట్యము ముఖంనుంచివచ్చి, ఏదో ఒక సద్బోధన కిరాతకుడికి హృదయపరివర్తన కలుగజేసింది. ఉపగుప్తుని ముఖంద్వారా 'అహింసాపరమో ధర్మః' అను నీతి వాక్యము వినపడ్డది. తక్షణం వ్యాధుడు విల్లమ్ములను విసర్జించి విరక్తిమార్గాన్ని పట్టాడు. ఉపగుప్తుడు ఆనూతపీడితమైన వ్యాఘ్రానికి నదిఒడ్డున శుశ్రూష చేస్తున్నాడు. అంతలో ఆశుభ్ర జ్యోత్స్నలో, ఆ పిల్లవాయువులలో ఆ కిన్నెరకలరవముతో. సమ్మిశ్రితగాత్రంలో సన్ననిరాగాలాపం శ్రవణరంధ్రాలలో పడింది. అది అతనికి సుపరిచిత గాత్రంలా తోచింది. నదీప్రవాహ మధ్య ప్రదేశాలయందు సంపాతి దృష్టి ప్రసరించాడు. చిన్నిడింగీ, డింగీలో చిరపరిచితవ్యక్తిలా కనుపట్టింది. రానురాను సమీపించిన ఆ చిన్నిడింగీ, డింగీలోవున్న ఆచిరపరిచితురాలు ఉలికిపడి, "ఆయ్యో! 'అఘాతక మృగానికి సేవలు చేయడమా? ఎంత వెర్రివాడవు" అనింది. "రమణీ! ఇది నీ పొరపాటు. అందచందాలు కనబరచి అమృతతుల్యమైన మాటలు కురిపించి. అనంగ బాణాలచే అమాయిక పురుషహృదయాలను ఘాతపరిచే ఆడదానికంటె భయంకరమైనదిగాదు, యీ వ్యాఘ్రము. మోహపాశములచే మానవుని వంచించి బంధించు మగువ సౌందర్యముకంటె ఎక్కువ భయంకరమైనదికాదు, యీ మృగము. మానవుడు తాను నిర్వహించు ధర్మాన్ని మరచి అనంత జన్మాలు యీ ప్రపంచకములో జన్మిస్తూ, జనన మరణాల చక్రంలో గిరగిర తిరుగుతుండే నిస్సారమైన స్త్రీలోభ ప్రేరణముకంటె ఎక్కువ భయంకరమైనది కాదు, యీ చదుష్పాద జంతువు". అన్నాడు ఉపగుప్తుడు. కాని అతని సద్బోధ అంతా ఆమెకొక సణుగుడులా తోచింది. అంతరార్థం గ్రహించలేని ఆకామినికి. "కామాతురాణాం నభయం నలజ్జా" అన్నట్లు "అదిగోచూడు! యీనాడు చుక్కలఱేడు చల్లని చూడ్కులతో విశ్వాన్ని ఆలోకిస్తున్నాడు. నీ దివ్య సౌందర్యం నాకు హృదయపరితాపాన్ని కలిగించింది. నాకు ప్రాణదానం చెయ్యి. యిదే మంచి అవసరం" అని ప్రలాపించింది. నీరాక కెదురుచూచి చూచి యీ నేత్రజ్యోతులు క్షీణించాయి. రోజులులెక్కపెట్టి పెట్టి యౌవనమంతా క్షీణించింది. ఇదే ఉచిత సమయం" అని ఎన్నోవిధాల వేడింది. ఐతే ఇప్పుడుకాదు. ఈ మాసంలో మరొకప్పుడు వస్తానని ఏదో సమాధానం చెప్పి పీడ వదల్చుకున్నాడు.

గ్రీష్మ, వర్ష, శరత్, హేమంత, శిశిర ఋతువులు ప్రేమ ప్రబోధనలను పురికొల్పుతూ వాసవదత్తకను పాపల్లోంచి చిత్రప్రతిమల రంకులరాట్నం మోస్తరు గిఱ్ఱుమని తిరిగిపోయాయి. ప్రేమప్రలాపులకు ద్విగుణీకృతభావాలను కల్పించే వాసంతిక తన చురుకు చూపులచే చెలికత్తెల ప్రేమ ప్రలాప హృదయాలను ద్రవింప చేస్తోంది, సూర్యకిరణాల చురుకులకు శిలాఫలకాలవలెపడియున్న హిమానికిమల్లె,హిమంద్రవించి సెలపళ్ళై, మహానదులై భీకరాకారం దాల్చి, భీభత్సంకొలిపినట్లుగా, కామినుల హృదయాలు కరిగి హిమబిందువులై వెదజల్లిన ముత్యాలకు మల్లె, ముఖమండలాన విజృంభించి సెలపళ్ళకుమల్లె సన్నని ధారలు అతృప్త అశాంత నేత్రాలనుండి వెలువడి నిరాశాభావం స్ఫురించడంతోనే హృదయ భీకరాకృతి దాల్చి బీభత్సం గలుగుతోంది. ఆశ నిరాశలు రెండూ ఏకకాలమందు ఎదుర్కొంటూ ఆమె హృదయంలో అదృశ్యమైన అగ్నిని ప్రజ్వలింపచేస్తున్నాయి. ఐతే ఏంచేస్తుంది? అతని ఆగమన సుహూర్తపు ఘడియలు సమీపించలేదు.

'ఆలశ్యం అమృతం విషం' అన్నట్లు కాలయాపన జరిగేసరికి వాసవదత్త ఒక నేరస్తురాలై రాజభటులచే బంధీకృత అయింది. కారణం? ఒక లక్షాధికారిని వధించింది. ధనలోభపరవశురాలైన వాసవదత్త. సౌందర్యపిపాసచే లోభపుచ్చి చాలమంది ధనవంతుల్ని వంచించిందనే నేరం స్థిరపరచి, న్యాయాధికారి ఆమెను వికృతాకారిణినిగా చేయ నిర్ణయించి అవయవాలలోపం చేయించాడు. అంతిమ శిక్షకు ముందు ఆమె ప్రార్థించింది, ఆ న్యాయాధికారిని, కొద్ది కాలం గడువుయిమ్మని. కారణం? ఉపగుప్తుని సందర్శించటం కొరకు. కానీ న్యాయాధికారి అంతిమతీర్పు ప్రకారం ఆమెకు గడువు దొరకలేదు. రాజభటులామె చరిత్రను వర్ణిస్తూ రాజబాటలలో త్రిప్పడం మొదలు పెట్టినారు, ఉపగుప్తుని ఆగమనానికి నిర్ణీతమైన ఆఖరి రోజు ఆనాడు. అన్నమాటప్రకారం రాజబాటలో

ఆమెను కలుసుకున్నాడు. అతన్ని చూచి ఆమె హృదయం చాలా పరితపించింది. "యీ నాడు యీ దురవస్థలో నా నీకు సుమూహూర్తమైనది. అయ్యో ! నా యీ దేహము వసంత మందమారుతాలచే సుశోభితమైనపుడు నీవు రాజాలక పోయావే" నేను చంద్రవదననై సౌందర్యామృతము పృధిమీద వెదజల్లుచున్నపుడు నీవు రాజాలకపోయావు. ఘాతకులు తమ కరవాలాలను వధ్యశిలమీద పదును పెడుతూన్నప్పుడైనా రాజాలక పోయావు. నా సౌందర్యం అదృశ్యమై పోయింది. ఇవుడు నీ వెందునిమిత్తం వచ్చావు?"

ఉపగుప్తుడు సోదరీ ! విషయలంపటుడనై యింద్రియసుఖాపేక్షినై రాలేదు. శారీరక సౌందర్యం అగణిత ఐశ్వర్యం కర్మప్రేరేపణకు కలసిరావు. యిందుకు తార్కాణాలు, నీ సహజ సౌందర్యం, అగణిత ధనరాశే. సాంసారిక దుఃఖములకు మూలము ఆశ. నీ వనంగ ప్రేరితవై అనేకమందిని వంచించావు. నీవు ధనాభావంచే ఒకధనికుని వధించావు. ఇపుడు నీ ధనం నిష్ప్రయోజనమైంది. నీ రూప లావణ్యములు నిరర్థకమైనవి. యిపుడు నీకు బాహ్య దృష్టులు లోపించినా, ఆంతరిక దృష్టులచే హృదయగ్రంధిలోని జ్ఞానజ్యోతి కనబడగలదు. సద్గురుని బోధ నౌక సాధనంగా ఉపయోగించుకుంటే, రా! బోధిసత్వుడు నీకు చేయూతయిస్తాడు. 'సత్సంగత్వే నిస్సంగత్వం. నిస్సంగత్వే నిర్మోహత్వం, నిర్మోహత్వే నిశ్చలతత్వం, నిశ్చలతత్వే జీవన్ముక్తిః" అన్నట్లు నీ దుఃఖసముద్రతరంగాలన్నింటినీ సత్సాంగత్యమనే చిన్ని తెప్పను ఊత చేసుకుని దాటగలుగుతావు." అన్నాడు ఉపగుప్తుడు. కర్మ పరిపక్వమయ్యేసరికి కాలిలో గుచ్చుకున్న ముల్లు కూడా ఒక సద్బోధ కలుగచేస్తుంది. ముల్లేకదా అని మన మనుకుంటాము, దాని చురుకుపోటు నాటినంత 'అమ్మో ! ఆ ప్రదేశం కంటాకాకీర్ణంకదా, చెప్పులు తొడుగుకుని గాని దాటి పోలే'మనుకుంటాము. ఆ మరునాడే వెళ్ళి చెప్పులు కొనుక్కొని మరీ నడుస్తాము ఇదీ మన మెలకువ.

ఏం చెపితేనేమి, వాసవదత్త హృదయగ్రంధిలో జ్ఞానజ్యోతి ఆంతరంగిక దృష్టులతో చూడగలిగింది. "యోగేనాంతే తనుత్యాజాం" అన్నట్లు బోధిసత్వుని చేయూతగా బౌద్ధమతం చేరుకుంది. శేషజీవితం పరిపక్వమైన హృదయంతో ప్రశాంతంగా గడిపింది. హృదయ పశ్చాత్తాపమే ఆమెకు మహాపాపహారిణి. అగు నిర్ఝరిణి ఐంది. ఆమెకు ఉపగుప్తుడు ఉత్తుంగ తరంగ సమన్వితమైన మహాపాతకార్ణవం దాటించ తెప్ప అయినాడు. ఉపగుప్తుని మనోనిగ్రహము (Will power) వాసవదత్తను మహాఘూర్ణవంనుండి తరింపచేయ ఆదర్శం అయింది. ★

# "నిరీక్షణ"

శ్రీమతి ధవళ రుక్మిణీదేవి

ఆపూల వనములో
అనురాగ లతికతో
ఆలపించితివి కద
సుమధుర గీతికలు.

పాలవెన్నెల రేయి
పవ్వళించితి హాయి
నీగాన మాధురిమ
మది నిలచెనే చెలీ.

పసిడి వన్నెల రేఖ
పయనించు నీ రాక
అందాల జాబిలీ
ఎదురు జూచెనె చెలీ.

సెలయేటి చిఱుగాలి
వలపుకన్నెపై జాలి
ప్రసరింపుమని వ్రాలి
పలుకరించెనె చెలీ.

శోకమున శోషించు
శుకపికామధుపములు
కలకంఠి కలసెనని
కలత వీడునె చెలీ

ఆనంద భవనాన
అనురాగ పందిరిని
నాట్యమాడిన హృదయ
రాణివైతివె చెలీ.

# గ్రామ సేవా కేంద్రము

**శ్రీమతి యస్. యన్. బేగం, జి. యస్.**

(తెరయెత్తేసరికి ఇందులోగల ఇద్దరు మామ్మలు, సంఘసేవిక తప్ప మిగతా పాత్రధారిణులందఱు వచ్చీసు అటలాగా పావులు గవ్వలు మొదలగు వాటితో కేంద్ర సంఘం రాష్ట్రసంఘం, జిల్లాసంఘం, గ్రామసేవాకేంద్రము ఆర్గనైజర్ అనేపదాలు వాడుతూ ఆడుతుంటారు)

శోభ :—సంధ్యా! రాష్ట్రసంఘంనుండి జిల్లా సంఘం అంటే. ఒక మెట్టు తక్కువలో వున్నావన్నమాట.

సంధ్య :— కేంద్రసంఘం అంటే నీకు అసలే తెలియదన్నమాట. దీనినిబట్టి చూస్తే అలాగే యున్నది. అవునులే. ఈ మధ్యనేగా నీవు కేంద్రానికి రావడము మొదలు పెట్టింది. కేంద్ర సంఘం అంటే, గ్రామకేంద్రానికి, జిల్లా సంఘానికి రాష్ట్ర సంఘానికి పెద్దది. బాగా జ్ఞాపకం పెట్టుకో. ఈ సారి అడిగితే మరచిపోకూడదు.

విమల :—మాట యెలాగూవచ్చింది గనుక అడుగుతాను. యింకొకసారి మరెందుకుగాని ఆర్గనైజరు అంటే యేమిటో చెప్పు, వివేకానంద!

వివేకానంద :—చూశారా, విమల, శోభ, మనగ్రామములో కేంద్రము పెట్టినప్పటినుండి రానందున విషయ జ్ఞానములో యెంత వెనుకబడుతున్నారో! మేమందరము మొదటినుంచి వస్తున్నాము. అ(.సరేలే,. ఆర్గనైజరుఅంటే తెలుగులో సంచాలిక లేక గ్రామసేవిక అని అర్థము. సరే. నిర్వచనంమాట యెలావున్నా ప్రభుత్వమువారి అంచనాలు తయారయిన తరువాత క్రియారూపములో సమస్యలను యెదుర్కొనేది, వాటిని పరిష్కరించేది, అవసరాలు తెలిసికొనేది, వారికి సహాయపడేది ఈ గ్రామసేవికే కాక ఇంకా అధికార వర్గమంతా వుంటుంది. మొత్తము మీద అందరు కలసి నిర్వహణ సులభం చేస్తారు.

శోభ :—ఆవసరాలు సమస్యలు అంటున్నారే, అంటే ఏమిటి? అవి యెలా సులభతరం చేస్తున్నారు? నూర్జహాన్.

నూర్జహాన్ :—ఎలాగంటావా? గ్రామీణ పిల్లల శారీరక వికాసానికి ఆటస్థలాలు కావాలి. బలమైన ఆహారము కావాలి. మంచి బాల విహారాలు కావాలి. ఇక మానసిక వికాసానికి మంచి విద్య గ్రంథాలయాలు సాంస్కృతిక వేదికలు మొదలైనవి కావాలి. శారీరక వికాసానికి ఈ సంక్షేమ శాఖలో పిల్లలకు మధ్యాహ్న భోజనాలు పాలు మొదలగు పౌష్టిక పదార్థాలను యిస్తూ అనేక రకములైన ఆటల పరికరములతో గ్రామగ్రామాన బాలల తోటలు ఏర్పాటుచేస్తున్నారు. అందరియొక్క మానసిక వికాసానికి మన యీ శాఖవారే మంచిగ్రంథాలయాలు ఉచితవిద్య, వేసవి కేంద్రాలు, విజ్ఞాన యాత్రలు, సౌహార్ద సమావేశాలు మొదలైన యేర్పాటు చేశారు. యింకా చేస్తున్నారు కూడా.

రాణి :—ఇవేనా? ఇంక ఏమిలేవా?

విమల :—ఎందుకులేవు ఈ శాఖ నిర్వహిస్తున్నవి యింకా అనేకమున్నవి. అన్ని మనము చెప్పుకోలేము. అయినా గ్రామ సమస్యలలో యింకా రెండుమూడు విషయాలు చెప్పుతాను. చాలా జాగ్రత్తగా విను, ముష్టివాళ్ళ విషయము చూడు! ఈ ముష్టియెత్తుకొనే వారిని ఒకచోట చేరుస్తారు. వాళ్ళలో బలవంతులనందరిని వారికి తగిన పనులలో నియమించుతారు. అశక్తులను వృద్ధులను ఒకచోటవుంచి పోషిస్తువుంటారు. అలాగే వికలాంగుల విషయముకూడాను. వారిలో తగినవారికి చేతిపనులు నేర్పించి భృతి గడుపు తుంటారు. చదువు లేకుండ పోకిరిగగాని, పేదవారుగగాని, బజారులవెంట తిరిగే విద్యా వయస్కులను గాని అనేక శరణాలయాలలో చేర్పించి చదువు చేతిపనులు నేర్పించి, వారి భవిష్యత్తులో ఒక మార్గాన్ని కల్పించి స్వతంత్రంగ విడిచిపెడతారు. ఉద్యోగాలలో నియమించుతూవుంటారు. అందుచేతనే మనది సంక్షేమరాజ్యము, బోధపడిందా?

రాణి :—నీవు చెప్పినదంతా చాలా బాగుందిసుమా! అందుచేతనే కాబోలు, మనగ్రామములో వున్న గ్రామ సేవికగారు కుంటి గ్రుడ్డివారి లెక్కలు తీసికోవడం గ్రామములో కొత్తపద్ధతులు ప్రవేశపెట్టడం, గ్రామాల స్థితులు కొన్ని మారిపోవాలని చెప్పడం, స్త్రీలందరు కొంత మంచి జ్ఞానము పొందాలని చెప్పడం జరుగుతుంది. అయితే ఫలానా ఫలానాపనులు నేర్పిస్తుంటారని వివరాలు మాత్రము నాకు తెలియవు. ఈ రోజున మీరు అన్నీచెబుతున్నారు కాబట్టి యికనుండి సంక్షేమ సాహిత్యమంతా చదవడము ప్రారంభిస్తాను. ప్రజాళిక నిర్వహణలకు సహాయము కూడ చేస్తుంటాను.

శోభ :—అవును రాణి నాకుకూడ సంఘసేవచేయాలనిపిస్తుంది.

(ఇంతలో ముసలిమామ్మగారు "అమ్మాయి" అని పిలుచుకుంటూ స్టేజిమీదకు రాగా బాలికలందరు "ఏం మామ్మగారు, ఏం మామ్మగారు. పెద్దవారు మీరు వచ్చారేమి? ఎవరినైన పంపలేక పోయినారా? ఈ వయస్సులో మీకెందుకు ఈ శ్రమ" అంటూ ఆమె చేతులుపట్టుకొని రండి రండి అని కూర్చోబెట్టుదురు.)

మామ్మగారు :—అయ్యో! అయ్యో! ఇదేమిపాప కాలమర్రా! మనిషిని అలా తాకుతూ కూర్చో బెడుతారేం? ఇదేమి అన్యాయం? దూరంగా పొండి, దూరంగా. ఎక్కువకులం, తక్కువకులం అన్నమాటే లేదే.

క్రీస్తుకుమారి:—అవును మామ్మగారు, కులమెందుకు? దేశం అన్ని విధాలా సౌఖ్యంగా వుండాలని ప్రభుత్వం వారు, ప్రజలు కష్టపడి పనిచేస్తూవుంటే యింక కులాల సంగతి యెందుకు? గొప్పకులాలవారే దేశాన్ని బాగు చేస్తారా? దేవుని పెండ్లికి అందరము పెద్దలమే. అందుచేత మీలాంటివారు మాలాంటివారు కలిసి దేశాన్ని బాగు చేయాలండి.

మామ్మ:—ఆఁ ఆఁ! పెద్దపెద్దమాటలుమాట్లాడుతున్నావు! ఈబుద్ధులెక్కడ నేర్చుకొన్నావమ్మా, నీపేరేమిటో నాకుతెలియదుగాని,

క్రీస్తుకుమారి :— నాపేరుక్రీస్తుకుమారి లెండి. ఏపేరైతేనేమి? నేనుచెప్పేదివినండి. మనగ్రామంలో సంక్షేమ శాఖవారి గ్రామసేవాకేంద్రమున్నదిగదా! ఆకేంద్రంలో, శిశుశాఖ, స్త్రీలశాఖ, వయోజనవిద్య మొదలైనవి నడుపబడుతున్నాయి. అక్కడ యింకా! చదువు, రాట్నంమీద దారంవడకడం, అల్లికలు, కుట్లు, ఎంబ్రాయిడరీ, తోలుపని, మిషనుమీద బట్టలుకుట్టడం, ఆర్థికంగా కలిసివచ్చే క్రొత్తక్రొత్తవంటలు. మొదలయినవన్నీ ఆటపాటలతో సహా నేర్పిస్తుంటారు, దేశంలో జరిగే విషయాలన్నీ తెలియజెపుతుంటారు. మేమందరము ఆకేంద్రవిద్యార్థినులమే కావాలంటే మీరుకూడా రోజూ మాతో వచ్చి తెలియని విషయాలన్నీ తెలిసికోవచ్చు.

నూర్జహాన్ :— కనుక మామ్మగారూ, రేపటినుండే మీరుకూడా మాకేంద్రానికివచ్చి- మీరుచెప్పే కులభేదాలకు మూఢనమ్మకాలకు, శాశ్వతంగా నీళ్ళధార వదలి, మీకు చేతనయినదానమేదో, అంటే, శ్రమదానం, సంపత్తిదానం, భూదానం, జీవనదానం, గోదానం, చేసికొంటూ, వుడుతాభక్తిగా దేశంకోసం పాటుపడి, మాలాంటిచిరంజీవుల మనస్సులలో దురభిప్రాయాలు అంకురించకుండుటకై పాటుపడండి మామ్మగారు, పాటుపడండి.

మామ్మగారు :—ఈములుకుల్లాంటి మాటలు యిక నేను వినలేనర్రా, నన్ను పోనీయండి, యిక నేను పోతాను. (అంటూ లేవబోవును)

నూర్జహాను ;— సరే అలాగే పోదురుగాని, ఒక్కమాటమాత్రం వినిపొండి మామ్మగారు.

మామ్మ :—ఏమిటి వినేది?

నూర్జహాను :—మీలాంటిపెద్దవారు చాలమంది, ముందు యిలాగే పౌరుషపడతారు. తర్వాతమాత్రం నెమ్మదిగా యిప్పుడు మేముచెప్పే సామ్యవాదానికి చాలా సాయం చేస్తుంటారు. ఉదాహరణకు చూడండి. హైదరాబాదురాష్ట్రంలో, రాయచూరుజిల్లా గుంఝూళ్ళిగ్రామంలో ముతరాసిరామక్క అనే ఆమె కస్తూర్బా గ్రామసేవా కేంద్రానికి 40 యకరాల భూమిని దానంగా వ్రాసియిచ్చారు. శ్రీకాకుళంజిల్లాలో మరొకదాత-సంఘకేంద్రానికి 90 సెంట్ల భూమిని దానంగా యిచ్చారు. చిత్తూరుజిల్లా మదనపల్లిలో మరొకశాస్త్రిగారు 40యకరాల ఆదాయమును, మరొక గ్రామసేవాకేంద్రమునకు దత్తతపర్చారు. లోకమంతా మారిందంటే నెమ్మండి మామ్మగారు. ఈరోజుల్లో యెవరైనా నేను ఫలానా గొప్పకులానికి చెందినవ్యక్తిని అంటే వారికి మంచినీళ్ళుకూడా పుట్టవు. వ్యక్తియొక్క మంచితనాన్ని, సేవాభావాన్నిబట్టియే వ్యక్తికి గౌరవం యిస్తున్నారు. బాలవాక్యం బ్రహ్మవాక్యం అన్నారు గాబట్టి, యీరోజునుండే మీవుద్దేశాలు మార్చుకొని అభివృద్ధి పథంలో నడుచుకొమ్మని మనవిచేస్తున్నాను మామ్మగారు!

మామ్మగారు :—ఇదిగో (ఆలోచిస్తూ) చూడండమ్మా. నాకిప్పుడు 65సంవత్సరాలు నిండాయి. ముసలిదాన్నయాను. నేనుకూడా యెన్నో గ్రంథాలు చదివాను. పురాణాలు విన్నాను. బాగా అర్థంచేసికొన్నాను, కాని ఆ పుస్తకాలలో చదివినదానికీ, మీరు చెబుతున్న విషయాలకీ మధ్య నాకు కొండంతభేదం కనబడుతుంది. ఒక విధంగా మీరు చెప్పినదంతా యీనాటికి తప్పనిసరి అయింది. ఈ పద్ధతులే ముక్తికీ భుక్తికీ మేలుగా కనబడుతున్నట్లున్నాయి. మీరందరూ చెబుతున్నవిషయాలు వినగావినగా, మీరందరూ మహామంచివారుగా కనబడుతున్నారు. ఏమి వినయం. యేంతెలివి! మీరందరూ మంచిబుద్ధిమంతులమ్మా. కనుక మీరందరూ చెప్పినదంతా నమ్ముతాను, తెలివి యెవరబ్బసొమ్ము.

(వెనుకనుండి కామాక్షిమామ్మ ప్రవేశం)

కామాక్షిమామ్మ :—ఏమే వెంకాయమ్మా, అమ్మాయికోసమని యిలావచ్చి యిందులో దూరిపోయావేమిటే?

# గ్రామ సేవా కేంద్రము

మామ్మ :—అవును కామాక్షి, మనలాంటివాళ్ళకిక కావలసిందేమిటి? మంచీ, చెడు, పుణ్యం, పాపం. అంతేగా. రా నీవు కూడా. ఇద్దరం ఒక ఘడియ వుండి పోదాం.

కా. మామ్మ :—ఇక్కడ కూర్చోవడానికి విశేషమేముంది? మహిళాసంఘాలనడం, వూర్కే మేకల్లా అరుచుకోవడమేగా? నువ్వూ తయారయ్యావ్, యికనేం? వీళ్ళేమైనా చెప్పేదుందా, మనం వినేదుందా?

వివెకానంద :—అన్నీ వున్నాయి మామ్మగారు. మీకేం కావలసినా అడగండి చెబుతాము,

కా- మామ్మ :—అయితేచెప్పండి. మీరందరూ యిలా సిగ్గూ, సింగారం లేకుండా బయలుదేరారే. మీకు దేవుడూ దెయ్యాలు, వున్నాయా, లేవా?

వివేకానంద :—అయ్యో, దేవుణ్ణి నిర్ణయించడానికి మనమేపాటివారం మామ్మగారూ ! దెయ్యాలంటే కేవలం మనభీతి, అనుమానం తప్ప, మరేదీ దెయ్యమంటూ లేదండీ. ఇక దేవుడంటారా, అది వారివారి అనుభూతులను, విశ్వాసమును బట్టి వుంటుంది. నమ్మినవారికి ప్రతి అణువులోనూ కనిపిస్తుంటాడు. మనస్ఫూర్తిగా నమ్మి, ప్రార్థించినవారికి మనస్సాక్షిని కలగిస్తుంటాడు. నమ్మనివారికి, యెన్నిపరిశోధనలు చేసినా ఒక్క యక్స్పరిమెంటుతోనూ కనబడడు. ఉదాహరణకు చూడండి. కురూపియో, అంగవైకల్యుడో దారినపోతుంటే, అతనిని చూడం. అతనూ ఒకవ్యక్తేనన్న భావంకూడా ఆ క్షణంలో స్ఫురింపజేసికోము. కాని, ఆ బాలునియొక్క (బిడ్డయొక్క) తల్లి, అతనినే మహాఅందగాడుగాను, యోగ్యుడుగానూ తలంచుకొని, సంతోషంతో ఉప్పొంగిపోయి, తన నూరుసంవత్సరాల ఆయుస్సు నింపుకొని యేక్షణాన్నైనా మరణిస్తుంది. అలాగే దేవుడుండటంలోనూ, ఆయన కనిపించటంలోనూ, నమ్మికలోనూ ధన్యత, తృప్తిపొందుటలోనూ ప్రతివ్యక్తికి, వివిధరీతులుంటాయి. దేవుడు లేడు అని వాదించే నాస్తికుడు, దేవుడంటే నాకు కనబడడేమి, నాకు చూపించండి అని అడిగితే, ఆ నాస్తికవాది దేముని చూచుటకు యేమార్గమూ నిర్ణయించుకొని, అనుసరించడు. కనుక అతనికి దేముని చూపించలేము. దేవుడు లేడు, అతనితో నాకేమీ అవసరం లేదు అని తలంచే మనిషికి, దేవుడుమాత్రం యెందుకు కనబడతాడు. ఉన్నాడు అని మనస్ఫూర్తిగా నమ్మితే ఆ నాస్తికుడికికూడా కనబడునేమో ! అలాగే ఒకరికి రాయిలో దేవుడుంటాడు. మరొకరికి చెట్టులో దేవుడుంటాడు, ఇంకొకరికి ఏదో దేవతలో దేవుడుంటాడు భక్తులచే, వారి ప్రేరణవల్లనే, దేవదేవుల చరిత్రలు వ్రాయబడినవి. అవే పారమార్థిక ప్రమాణ గ్రంథరాజములై విరాజిల్లుచున్నవి. ఎందరో మహానుభావులు చెప్పినట్లు సత్యం పలుకుతూ ధర్మమార్గాన నడుస్తూ, న్యాయానిబద్ధులై, మానవాతీతమైన అద్వితీయశక్తిని విశ్వసిస్తారు

కా. మామ్మ:—అవును నిజమేనమ్మా, యిప్పుడు నీవు చెప్పినట్లు, దేవుడు మనందరిమధ్యనే యుండి యి మంచి గోష్ఠిని జరిపించుచున్నాడని యెందుకనుకోగూడదులే !

మామ్మ:-అయితే అమ్మాయిలూ ! యింకా చెప్పండి ఈమధ్య మనవూర్లో డప్పులు, బాజాలు మోగ తున్నాయి యెందుకంటారూ !

సంధ్య :—ఆఁ ! అవన్నీ పంచవర్ష ప్రణాళికలగురించి లెండి, మామ్మగారు.

రాణి:-ఆఁ ! ప్రణాళికలంటే యేమిటో చెప్పండోయ్ నాకు బొత్తిగా తెలియదు వీటినిగురించి.

సంధ్య:-పూర్తిగా చెబుతాను. బాగా వినాలి. అడిగిన తర్వాత, వినకపోతే నాకు బహువిసుగుసుమా! వినడమే కాదు, నీవు రేపటినుండే యీ ప్రణాళికల్లో భాగంతీసికొని పనిచెయ్యాలి. పంచవర్ష ప్రణాళికలంటే, దేశసౌభాగ్యానికి, మనము యేర్పాటుచేసికొన్న అనువైన 5 సంవత్సరాల పథకము అని అర్థము. ఈ ప్రణాళికాకాలంలో, దేశంలో అభివృద్ధి, యేది యెంతవరకు జరపాలి అని అంచనా వేసికొని, దానిప్రకారం పనిచేయిస్తూంటారు. ఈ ప్రణాళికలు అనే పథకాలక్రిందనే, మేము చదువుకొనుచున్న పాఠశాలలు, స్త్రీలశాఖలు, ప్రతిగ్రామాని కొకహాస్పిటలు, ప్రతిపల్లె కొకమంత్రసాని, ప్రతిఊరి కొకరేడియో, ప్రతి గ్రామానికి పోస్టాఫీసు, రోడ్లసౌకర్యాలు, బంజరుభూముల సాగుబడి, పారిశ్రామికసంస్థల, నీటివసరుల స్థాపన, నిరుద్యోగ నిర్మూలన, ప్రత్యేకరక్షణ, శిక్షణకేంద్రాలు యిలాటివే అనేకం వుంటాయి. అన్నీ యిన్నీ, అవీ, యివీ అననేలా. మన భారతదేశంలో పుట్టిన ప్రతిప్రాణికి తగిన వసతులగూర్చుటయే యీ పంచవర్ష ప్రణాళికల ప్రధానోద్దేశం. దాని నర్థంచేసికొని కృషిచేసిననాడే సంక్షేమ విస్తరణ, ప్రణాళికల అభివృద్ధి జరుగుతుంది.

మామ్మ:- అయితే వీటన్నిటికి డబ్బెక్కడనుండి వస్తుందమ్మా ?

నూర్జహాన్:- దీనికంతకూ మనం పన్నులరూపంలోనూ, అప్పుగానూ ప్రభుత్వానికి యిస్తున్న పైకంలో

నుంచే. ఈ పథకాలక్రింద మన భారతదేశంలో గల ప్రతిపల్లెకూడా సర్వసౌఖ్యాలతో వుండాలన్నమాట.

క్రీస్తుకుమారి:- అమ్మా, మా కేంద్రంతరపున యేర్పాటు చేసిన ప్రదర్శన చూశారా రాణీ?

రాణి:- ఆఁ! నిన్ననే వెళ్ళి చూచివచ్చాను. కాని, నాకది పూర్తిగా అర్థంకాలేదు.

నూర్జహాన్:- ఆసలు అలాంటియేర్పాట్లు చేయుటంలో గల వుద్దేశమేమంటే, వస్తూత్పత్తిని యెక్కువచేయాలని, నాణ్యత హెచ్చించాలని, ప్రోత్సహించాలని, యిలాటి ప్రదర్శనలు వివిధరంగాలలో యేర్పాటుచేసి చేతికళలను. సంగీత, సాహిత్య, నాటకాది కళలనుకూడా బాగా ప్రోత్సహించి, అక్బరు, కనిష్కుడు. కృష్ణదేవరాయలు మొదలగు రాజులు పోషించిన 64 కళలను, యీనాటి మన ప్రజాప్రభుత్వాలు యీ పంచవర్షప్రణాళికలక్రింద అభివృద్ధి చేయాలన్నది ఒక నిర్ణయంకూడాను. అష్టదిగ్గజాలు, నవరత్నమండలాలుకూడా యేర్పాటయే సూచనలున్నాయి.

(ఇంతలో ఒకసంచి తగిలించుకొని సర్వోదయ సంఘసేవిక ఒకామె ప్రవేశించును. పిల్లలందరూ 'నమస్తే' అని చేతులు జోడిస్తారు.)

క్రీస్తుకుమారి:- కుర్చీలో కూర్చోండమ్మా.

సంఘసేవిక:- అమ్మా, బైట మీ కేంద్రంయొక్క బోర్డు చూసి లోపలికొచ్చాను. మీ అధికారులెవరో కొంచెం పిలుస్తారా.

విమల:-గ్రామసేవిక, మంత్రసానిగారే మా అధికారులండి. ఎవరో, స్త్రీలపౌదుపు వుద్యమఆఫీసర్ వచ్చారని, మాట్లాడివస్తానని ఒకగంటక్రితం మా గ్రామసేవికగారు అలా వెళ్ళారండి. తర్వాత మా మంత్రసానిగారు ప్రక్క గ్రామంలో యేదో కష్టమైన కాన్పుకేసుందని నిన్ననగా వెళ్ళారండి. ఈరోజు వస్తారండి.

సంఘసేవిక :—అమ్మా ఇప్పటికే చాలటైంఅయింది. సరేనమ్మా అయితే చూడండి. నేనొక సంఘసేవకురాలను. ప్రభుత్వంవారు వచ్చేనెలలో మనదేశరాజధాని నగరంలో సుశిక్షితులు క్రమశిక్షణ గల బాలికలకు ఆరు వారాలపాటు ఒకసాంఘిక విజ్ఞాన యాత్రను యేర్పాటు చేయదలంచి యీప్రాంతంలో అభ్యర్థినులను యెన్నుకోవలసిందిగా నన్ను నియమించారు. ఇంతవరకూ బైటనే నిలబడి మీరు చర్చించినవిషయాలన్నీ విన్నాను. అప్పుడప్పుడు పేపర్లలో కూడా మీకేంద్రవిషయాలు చదివాను. మిమ్మలను చూచినతర్వాత మీఅందర్నీ ఆయాత్రాజట్లలో చేర్పించాలని తోచింది. అందువల్ల మీరందరూ మీపేర్లు అడ్రస్సులు చెప్పండి. తర్వాత మీగ్రామసేవికగారికి వుత్తరాలు వ్రాసి తెలియజేస్తాను. (అందరిపేర్లు, అడ్రసులు వ్రాసికొని 'నమస్తే' అని వెళ్ళిపోవును)

రాణి :—(అందర్నీ తప్పించుకొని ముందుకువచ్చి) సోదరసోదరీమణులారా, బాలబాలికలారా, చిన్నలారా, పెద్దలారా! మాసోదరీమణులు చెప్పినదంతా విన్న తర్వాత, ప్రణాళికలంటే యేమిటో అర్థంచేసికొన్నాను. హక్కును వినియోగించుకొన్నట్లే, ప్రభుత్వంపట్ల ధర్మాన్ని నిర్వర్తించాలి. ఈవిషయాలన్నీ యేకొందరమో అనుకొంటేచాలదు. ఇక్కడ సమావేశమయిన యీఅందరిగుండా శపథం చేయించి, కులభేదాలు, ఛాందసభావాలు బోగొట్టుటకు. జ్ఞానసముపార్జనకు, సత్యం, శాంతం, దయాగుణాలకు యీరోజునుండే కార్యక్రమాలు మొదలుపెడదాం. మనసాప్రార్థనతో, యీనాటి కార్యక్రమాన్ని ముగించుదాం.

| | |
|---|---|
| ఏదీచెప్పండి— | (ప్రజలు) |
| మహాత్మాగాంధీకి— | జై |
| కస్తూర్బాగాంధీకి— | జై |
| స్వతంత్ర భారత్‌కి— | జై |

# వార్తావళి

## అమెరికా

అధ్యక్షపదవికి అభ్యర్థులుగా డెమొక్రాటిక్ పక్షాన జాన్. ఎఫ్. కెన్నడీ; రిపబ్లికన్ పక్షాన (వైస్‌ప్రెసిడెంటుగా ఉండిన) రిచర్డు యం. నిక్సన్ - పోటీచేశారు. కెన్నడీ 272,876 వోట్ల మెజారిటీతో అధ్యక్షుడైనట్లు వెల్లడింపబడింది. ఉపాధ్యక్షుడుగా - సెనేటర్, - లిండన్ బి. జాన్సన్‌ను, సైనికరక్షణ శాఖాధికారిగా - సెనేటరు, స్టూవార్టు - సైమింగుటన్‌ను నియమించినట్లు కెన్నడీ ప్రకటించాడు. విదేశాంగశాఖలో చాలా మార్పులుంటాయని తెలుస్తున్నది. మున్ముందుగాని అవి స్పష్టపడవు. అయితే కమ్యూనిస్టు రాజ్యాల విషయంలోను, ముఖ్యంగా రష్యా విషయంలోను ఈ క్రొత్త అధ్యక్షుడు ఎలా తన ప్రభుత్వం నడుచుకుంటుందో విస్పష్టం చేయలేదు. పాశ్చాత్యరాష్ట్ర ప్రభుత్వాలు అందుకోసం వేచిచూస్తున్నవి.

అధ్యక్షుడు కెన్నడీ తన మిత్రులతో "భారతదేశపు ప్రజల బిదరికాన్ని తొలగించడానికి తప్పక సహాయంచేయ నిర్ణయించుకున్నాననిన్ని; మూడవ పంచవర్ష ప్రణాళిక జయప్రదంగా నెరవేరేటట్లు తగిన ప్రయత్నాలు చేస్తా"ననిన్ని చెప్పినట్లు తెలుస్తున్నది. లోగడ కొన్నియేండ్లుగా కెన్నెడీ భారతదేశం ఆర్థికవిషయాల్లో శ్రద్ధవహించి, ఇక్కడ రాయబారిగా న్యూఢిల్లీలో కొంతకాలం ఉండిన (రిపబ్లికన్) సెనేటరు జాన్ షెర్మన్‌కూపరుతో కలసి, భారతదేశ సహాయక సంఘము (Help India Club) ను స్థాపించడం ఆయనకు మనదేశ విషయంలో గల సుహృద్భావాన్ని వెల్లడిస్తున్నది.

## కాంగో

ఇటీవల ఐక్యజాతీయసమితి ప్రతినిధిగా కాంగో పరిస్థితులు పరిశీలించిరావటానికి పంపబడ్డ శ్రీ రాజేశ్వర దయాలుగారు అక్కడి అనేక (నాయక) ప్రభుత్వాలచే ఏర్పడ్డ ప్రజానీకం అలజల్లను, అందుకు కారణమై, ఒక పక్షాన్ని మాత్రమే బలపరస్తూన్న బెల్జియంచర్యలను, వాటిని తొలగించడానికి సమితి అవలంబించతగిన మార్గాలను సూచిస్తూ ఒక నివేదిక సమర్పించాడు. సమితి కార్యదర్శి - హామర్‌షోల్డు దాన్ని ప్రకటించాడు. అందులో:- "కాంగో సైన్యాన్ని ఎట్లనయినా స్వాధీనంలోకి తెచ్చుకుంటే, అరాజకానికి కారణాలయిన మురాలను అన్నిటిని అణచివేస్తే - తప్ప, యథాప్రకారం ప్రభుత్వకార్యాలు జరగటానికి వీలుకలుగదు. ఇప్పటి విప్లవ పరిస్థితుల్లో కాంగో ప్రెసిడెంటు, పార్లమెంటుమాత్రమే నిలవటానికి వీలవుతుంది. అప్పుడు కాంగో రాజకీయ నాయకులందరు తమ సమస్యలను పరిష్కరించుకోగలరని దృఢంగా నమ్మవచ్చును. ఈ సందర్భంలో ఇతర దేశప్రభుత్వాలు ఏమాత్రం జోక్యం కలిగించుకోరాదు."

కాని, యిటీవలి వార్తలనుబట్టి, లియొపోల్డుజిల్లాలో జరిగిన విపరీతమయిన దౌర్జన్యాలు. ప్రజోపద్రవకార్యాలు కాంగోలో అమితసంచలనానికి కారణమయినాయి. కాంగో విప్లవకారుల సేనలు, ఐక్యరాజ్య సేనలమీదికి తిరుగబడినవి. అక్కడి భారత సైన్యాధికారులను మార్కొని వారిని నానావిధాలుగాహింసిస్తూన్నవి. తుదకు శ్రీహామ్మరుషోల్డుయొక్క ప్రత్యేకప్రతినిధియగు శ్రీ రాజేంద్రదయాలుగారి భవనాన్నిగూడ కాంగో సేనలు ముట్టడించే వార్తలు రాగా, ఐక్యజాతీయ సమితివారు తగుజాగ్రత్తలు తీసుకొంటున్నారు. ఈవార్త తెలిసి న్యూయార్కుకు వెళ్ళియున్న శ్రీ దయాళుగారు లియొపోల్డువిల్లాకు మరలినారు.

కాంగో ప్రెసిడెంటు శ్రీ కసవాబు ప్రాతినిధ్యాన్ని ఐక్యరాజ్యసమితి అధిక సంఖ్యాకుల ఓట్లతో అంగీకరించింది.

## లావోస్

అమెరికావారు తాము వాగ్దత్తం చేసినట్లు ఆర్థికంగాగాని సైనికంగా గాని తన దేశాభ్యుదయకార్యాలకు సహాయం చేయనంతట తాను విధిలేక కమ్యూనిస్టు దేశాలను ఆశ్రయింపవలసి వస్తుందని యిదివఱలో హెచ్చరించాడు. లావోస్ రాజకుమారుడు ఫౌమా. కాని, దాన్ని యిన్నాళ్ళు అలక్ష్యంచేసి ఊరక ఉండిన అమెరికా, ఇప్పుడతడు చైనా సహాయాన్ని కోరగానే, "కమ్యూనిస్టు దేశాలవల్ల ఆర్థికంగాగాని సైనికంగాగాని యేలాటి సహాయం అపేక్షించినా, లావోస్ స్వాతంత్ర్యానికి ఆపద సంభవిస్తుంది. తాటస్థ్యంగా ఉండినా అది తప్పదు." సోవియటు ప్రభుత్వంకూడ ఫౌమాకు తోడ్పడటానికి నిశ్చయించింది.

## న్యూఢిల్లీ

బర్మా ప్రధాని పత్నీసమేతంగా బౌద్ధక్షేత్రాల యాత్ర సెపంతో 11-9-60న న్యూఢిల్లీకి వచ్చాడు. రాజకీయపక్ష నాయకులు ఆయన రాకనుగూర్చి పరిపరివిధాల వ్యాఖ్యానించారు. కారణం చైనా, భారతదేశాల సరిహద్దులను గూర్చి అధికారవర్గం మూడవసారిగా (తుదిసారిగా) రంగూనులో సమావేశం కావడం. పైగా సరిహద్దుల విషయంలో ఆరేండ్లుగా ఉన్న తగాదాలనన్నిటిని చౌ. యన్-లై; యూనూగార్లుచక్కబెట్టుకొని భాయిభాయిగా ఉండటం. భారతదేశానికి పొరుగుదేశమయిన బర్మా ప్రధాని సలహా పండిత నెహ్రూ తప్పక చేకొంటాడని భావించటం. ఈ హేతువులన్ని పత్రికా విలేఖరులకు కొంతపని కల్పించినమాట వాస్తవమే. కాని ప్రధానులిరువురుగూడ 'కిమన్నాస్తి'గా - (చైనా, భారత సరిహద్దు తగాదాలనుగూర్చి ఏమాత్రం ప్రస్తావించకుండ) ఉండిపోయినారు.

జపాన్ క్రౌన్‌ప్రిన్సు అఖిటో, ఆయన సతీమణి శ్రీమతి మిచికోలు కూడా 13-11-60 న, మన భారతదేశానికి వచ్చారు. ఇక ఇంగ్లండు మహారాణి ఎలిజబెత్తు జనవరి ప్రారంభంలో భారతదేశానికి రాగలదు. అప్పుడే ఇంగ్లండు నుండి ప్రభుత్వ ప్రతినిధులు ఆమె యిక్కడి కార్యక్రమాలను ప్రకటించటమేగాక - ఆమెకు తగిన స్వాగతం జరగటానికి తగిన సరంజాం చేస్తున్నారు.

రాష్ట్రపాలకుల (Governors) వార్షిక మహాసభ యెప్పటి మోస్తరే న్యూఢిల్లీలో 8-11-60 తారీఖున సమావేశమయి, ఆయా రాష్ట్రాల పరిస్థితులనుగూర్చి చర్చించి, న్యాయరక్షణకు శాంతిస్థాపనకు చేకొనదగిన చర్యలను నిర్ణయించుకొంటూ కొన్ని తీర్మానాలు చేసికొన్నారు.

14-11-60 న నెహ్రూ గారి జన్మదినోత్సవం దేశమంతటా ముఖ్యంగా ఢిల్లీ నగరంలో మహావైభవంగా జరిగింది. ఆనాడు బాలదినోత్సవంలో ఆయన పాల్గొన్నారు.

ఫెడరల్ రిపబ్లిక్ జర్మనీకి పూర్వం అధ్యక్షునుగా ఉండిన - డాక్టరు థియోడోర్ హాసు, మనదేశంలో పర్యటిస్తూ మదరాసుకు కూడా వచ్చారు. (సెనేటుహౌస్) విశ్వవిద్యాలయ సభలో 'జర్మనీదేశపు ఆర్థికదౌర్బల్యాన్ని' గూర్చి ఉపన్యసించారు.

## హై ద రా బా దు

శ్రీ పళ్లంరాజుగారు రాష్ట్రకాంగ్రెసు అధ్యక్షపదవి స్వీకరించటానికి కొన్ని షరతులను ఇరుపక్షాలవారు అంగీకరించాల్నని కోరగా, యూనియన్ ఫ్రంటువారు అందుకేమాత్రం సమ్మతింపనందున ఆయన ఈ మధ్యను ఢిల్లీకి వెళ్ళాల్సివచ్చింద. కాంగ్రెసు అధ్యక్షునితోనూ, తక్కిన కొందఱు అగ్రనాయకులతో ఆయన సంప్రతించటంలో - ప్రకృత పరిస్థితిల్లో పళ్ళంరాజుగారు తాను పెట్టిన షరతులను ఉపసంహరించుకోవటం యుక్తమనిన్ని, తక్షణం అధ్యక్షపదవిని స్వీకరించి కార్యవర్గాన్ని ఎన్నుకొని కాంగ్రెసులోని చీలికలను చక్కదిద్ది ఐకమత్యం కలిగించి, సంస్థకు బలం చేకూర్చటం అవసరమనిన్ని సలహాయిచ్చారు. యునైటెడ్ ఫ్రంటువారు వ్యక్తిగత దురభిమానంతో మురాతత్వాలతోనే ఇంకా కాలక్షేపంచేస్తూ కూర్చునే పక్షంలో దేశంలో విజృంభిస్తూ ఉండే ఇతర పార్టీలకు పరోక్షంగా బలం చేకూర్చినట్లు కావటమేకాకుండ, తామూ, తాము పెంచిన మహాసంస్థ రాష్ట్రంలో అప్రతిష్ఠకు పాల్పడవలసివస్తుంది. తస్మాజ్జాగ్రత జాగ్రత!

## వి జ య వా డ

రాజకీయరంగంలో ప్రవేశించి, రైతుజనబాంధవుడుగా, దేశసేవాతత్పరుడుగా, చాలకాలము కాంగ్రెసువాదిగా ప్రసిద్ధివహించి, ప్రకృతము యావద్భారత స్వతంత్రపక్షనాయకుడుగా వెలుగొందుతూన్న శ్రీ రంగాగారి షష్టిపూర్తి, వాహినీ పత్రికా రజతోత్సవాలతో పాటు బిడాయించి జరిపిన ఆంధ్రరాష్ట్ర స్వతంత్రపక్ష మహాసభకు దేశంలోని స్వతంత్రపక్షాతిరథమహారథులందఱు హాజరయినారు. వారందఱు విజయవాడలోనేగాక, గుంటూరు వగైరా ప్రదేశాలుకూడా సంచరించి సభలు జరిపి, ఇప్పటి కాంగ్రెసు ప్రభుత్వాన్ని ఇచ్చవచ్చినట్లు దులిపి దుయ్యబట్టారు. ఇది తెలుగునాటిలో ఎంతవరకు నాటుకొని పనిచేయగలదనేది ముందుముందుగాని తెలియదు.

## మ ద రా సు

వరుణదేవుడి శీతకన్ను ఈ సంవత్సరం ప్రాగ్దక్షిణ భారతంమీద పూర్తిగా పడిందని చెప్పాలి. అనగా, అతివృష్టి తుపాను, మదరాసు నగరంలోనేకాక, మదరాసు రాష్ట్రమంతటను, ఆంధ్రరాష్ట్రంలోని రాయలసీమ ప్రాంతాలలోను విలయతాండవంచేసి విడిచిపెట్టింది. దాదాపు రెండు దశాబ్దాలుగా ఇట్టి ఉత్పాతం కనీవినీ ఎరగమని జనవాక్యం. ఒక్క మదరాసుపురంలో మాత్రం తుఫానుగాలులవల్ల 20670 మంది కుటీరవాసులకు నిలువనీడలేకుండ పోయింది. ఇంచుమించుగా 7600 గుడిసెలు గంగానమ్మ పొట్టబెట్టుకుంది. పార్కులలోను, బాహాటమయిన రహదారులలోను 554 చెట్లు సమూలంగా కూలిపోయినాయి. దృఢములయిన గోడలు పెక్కుచోట్ల నేలమట్టమయింది. సుమారు పదిమందివఱకు ప్రాణాలు కోల్పోయారు. 20 మందికి చెట్లు, గోడలు పైన కూలడంవల్ల గాయాలు తగిలినాయి. పశ్వాదిజీవాలు 28 మరణించాయి. చాలచోట్ల విద్యుత్తంత్రులు తెగినాయి. వాటి స్తంభాలు ఒరిగినాయి; కొన్ని వంగినాయికూడ. ఈ బీభత్సం అంతా 20 తేదికి ప్రశాంతస్థితికిరాలేదు.

మదరాసు కీల్పాకులో "బాలవిహార్" - అనే బాలల వృత్తివిద్యాకేంద్రక ఒకటి క్రొత్తగా స్థాపింపబడింది. దానికి మదరాసు కలెక్టరుగారి అధ్యక్షతక్రింద 24-11-60 తారీఖునాడు ప్రారంభోత్సవం జరిగింది. కేంద్రాన్ని మదరాసు మేయరుగారగు శ్రీ యం. యస్. అబ్దుల్ ఖాదరుగారు తెరిచారు. దీని వ్యవస్థాపకులు, గౌరవకార్యదర్శులు - లెప్టినెంటు-కలనల్ యన్. వాసుదేవరావుగారు.

ఈ కేంద్రంలో విద్యావిషయాన చురుకుదనంలేని పిల్లలకు చాపలల్లటం, వెదురుతడికెలల్లటం, నూలువడకటం, నాడాపట్టెలు తయారించటం, బొమ్మలు చేయటం, కాగితపు పనులు చేయటం, గుడ్డలు కుట్టటం, తోటలువేసి పెంచటం మొదలయిన పనులు నేర్పబడుతుంది. ఈ సంవత్సరం మగ్గాలమీద గుడ్డలు నేసే వృత్తికూడా ప్రవేశపెట్టబడింది. ఇది పెంపొందే సూచనలున్నాయి.

కలెక్టరుగారగు శ్రీ కృష్ణస్వామిగారు ఈ కేంద్రకార్యాలను, వ్యవస్థాపకులను అభినందించారు.

శ్రీమతి క్లబ్‌వాలా జాధవుగారు ఈ కేంద్రానికి విరాళాలిచ్చిన, కేంద్రరాష్ట్ర సంఘ సంక్షేమ సంస్థలకు కృతజ్ఞతానుతులర్పించారు.

# గ్రంథసమీక్ష

(సమీక్షకు రెండేసి ప్రతులు పంపాలి)

1. రాచమల్లు కన్నయ్య్యా సన్మానసంచిక (అమూల్యం.)

2. గురుదక్షిణ — రూ 1/-

## ప్రకాశకులు : భారతీసమితిః
## పామఱ్ఱు : కృష్ణాజిల్లా;

**మొ**దటిది శ్రీ కన్నయ్యగారి దాతృత్వాన్ని గూర్చి తెలిపేగ్రంథం. వీరివదాన్యత కృష్ణాగుంటూరు జిల్లాలవఱకే పరిమితమైనా, అతివేలమయినది కాననే, శ్రీ అబినవతిక్కన, శ్రీ బండారు తమ్మయ, శ్రీ కోగంటి, శ్రీ భానయ్యచౌదరి మున్నగు సుప్రసిద్ధకవుల నుతుల కాలవాలమయినది- దాదాపు శ్రీ కన్నయ్యగారు ముప్పాతికలక్షవఱకు వ్యయంచేశారంటే, అదీ సామాన్యవిషయంకాదు. ఈ కాలంలో అంతటిధర్మచింతన, ఉదారస్వభావం ధనవంతులకం దఱికలవడిననాడు వారెల్ల రఘుమహారాజులే అయి కూచోరా? విశ్వజిద్యాగాలు చేయరా? మఱి కుబేరుఁడుకాఁడు; దేవుఁడే జడిసి కనకవర్షం కురిపించఁడా?— గ్రంథంతుదలో ఉన్న వీరిజీవితచరిత్రం శ్రీమంతులకాదర్శం కావాల్నని మాఆకాంత.

రెండోది శ్రీ జాస్తివేంకటనరసయ్యగారి 51-వ జన్మదినోత్సవ సందర్భంలో వారిశిష్యులు సమర్పించుకొన్న 'గురుదక్షిణ' పేరి ప్రశస్తిరూప గద్యపద్యాల సంపుటి. మిత్రులప్రశంసలుకూడ ఉన్నవి. వీరాజన్మ బ్రహ్మచారులు, దేశభక్తిపరాయణులు, మీదుమిక్కిలి సారస్వతనిష్ణాతుల కుటుంబమువారు, అభినవతిక్కనగారి మేనల్లుండ్రు. లలితలలితములగు పదములతో ముచ్చటగూర్పు రచనములు సాగించుటలో సిద్ధహస్తులు,

మూడోది వ్యాసవాణి (రెండవభాగము) — ఇది శ్రీ జాస్తివేంకటనరసయ్యగారు పర్చికూర్చిన పలు విషయాలుగలది. సారస్వతానికి సంబంధించిన వ్యాసాలు చాలభాగం ఆక్రమించుకొన్నవి. అష్టదిగ్గజాలవారని పేర్కొన్న శ్రీ మధునాపంతులవారి పట్టికలో ఒక్కరైన రాయలసీమవారు రాలేదేమి? కనుక వారివాక్కు ప్రామాణ్యంగా స్వీకరింపఁదగినదేనా? అని కొందఱుకాకున్నా, కొందఱభిజ్ఞులయినను అనుకొనటం సహజం,మఱి అభినవతిక్కన్నగారి లోకోత్తరరచనలనుగూర్చి 10 పుటలవఱకు వ్రాయుట సముచితమే; కాని శ్రీ భీమన్నగారిని కావ్యవీధిలో సంచరించే మత్తశుండాలంగా ఇంకా ఆంధ్రలోకం గుర్తించనప్పుడు అన్నిపుటలు వ్రాయుట అసహజమని పిస్తుంది. పదవీవాల్లభ్యానికి భాషావరివస్యకు లక్తి కుదరడం కష్టం.

4. దక్షిణానిలము :— కర్త : ఎమ్మనూరు చిన్న వేంకటరెడ్డి;

వెలరూ1/— విద్యోదయాపబ్లికేన్సు, కడప.

గ్రంథకర్త, 'రంభ'— 'మేనక'— 'తొలకరి చినుకులు' మొదలగు రచనలచే ఇదివఱకే తెలుగు నాటికి చిరపరిచితులయినవారు. భావనాబలసంపన్నులైన వీరికవితలు—అవి గేయములుగాని- గీతములుగాని మధుర మార్దవ మనోజ్ఞ శబ్దములతో జాలువాఱుచు సరసజనహృదయంగమములుగ నిర్ఝరనిర్ఝరిణీ సదృశముగ సాగిపోవుచుండును. స్వస్థలాభిమానులగు ఈకవిగారు తమమండల సాంకేతికములకు ప్రాధాన్యమిచ్చుటచే వీరిరచనలు మఱింత రాణించుచున్నవి. భాగ్యహీనులగుటం గాఁబోలు వైకెక్కలేకున్నారు. వీరి- యీకావ్యానికి శ్రీ పుట్టపర్తివారి పీఠిక మకుటాయమానము. మచ్చున కొండు రెండు గేయాలు :—

> "తొలికోడికూత బొత్తులపాప నెడబాసి
> మలికోడికూతతో పొలముజేరెడి బ్రతుకు
> చిఱునగవువిడని వడిసెలకన్నె దిలకించి
> అలసముగ దక్షిణానిలము మాగడ్డపై"
>
> వీచెనమ్మా! యిపుడె!
>
> "అప్సరస్సతుల కైశ్యములఁ బోలిన చారు
> చంద్రకాంకిత బర్హ సందోహ బర్హాభా
> రావసితమై యందమలరారు నడకతో
> అలసముగ దక్షిణానిలము మాగడ్డపై ॥వీ॥.

ఆచార్య రంగా షష్టిపూర్తి, వాహిని రజతోత్స వాల ప్రత్యేక సంచిక మాకార్యాలయానికందింది. ఇది 7-11-60 నాడు విడుదలఅయింది. దాదాపు 220పుటల బృహత్సంపుటి వెల-రు2/-

ఇందులో- రజతోత్సవభాగంలోని 88పుటలు, షష్టి పూర్తిభాగం 114పుటలు, ఆంధ్రప్రదేశ్ స్వతంత్రపార్టీ ప్రథమమహాసభల అనుబంధం 16పుటలు ఆక్రమించు కున్నాయి.

మొదటిభాగంలో వాహినీపత్రికా ప్రశంసలతో బాటు కొందఱు ప్రముఖుల వ్యాసాలుకూడా ఉన్నాయి. రెండోభాగం అంతాకూడా ఆచార్య శ్రీ రంగాగారి జీవితచరిత్రమని చెప్పొచ్చు. పలువు రాయ నదేశసేవాదికాలను గద్యపద్యరూపాలలో ప్రశంసిం చారు. ఈభాగం అంతా సమగ్రంగా చదివితే, వారు (శ్రీ రంగాగారు) స్వీయచరిత్ర వ్రాసుకోవలసిన శ్రమకు పాల్పడవల్సిన అవసరం ఏమాత్రం లేదనిపి స్తుంది. మూడోభాగంలో కాంగ్రెసుప్రభుత్వ విష యంలో అసంతృప్తులైన ప్రదేశ్ స్వతంత్రపార్టీనాయ కుల ఉపన్యాసాలు వెలుస్తున్నాయి.

మొత్తంమీద చాలకాలంగా రంగాగారి అధ్వర్యం క్రింద దేశసేవచేస్తూ రజతోత్సవాన్ని జరుపుకుం టూన్న- సందర్భంలో ఈలాంటి సంచికను వెలువరిం చిన 'వాహిని'కి- మాధన్యవాదాలు. 'కౌశిక'

### విజ్ఞప్తి

రాజకీయ, సాంఘిక, సాహిత్యరం గాల్లో తెలుగునాట అంతటా విఖ్యాతి గాంచిన ఆంధ్ర వనితామణుల సంగ్రహ చరిత్రలు (ఒక్కొ-క్క-రిది) ఒక్కొ-క్క- పుటకు మించకుండా ప్రతి నెలా ఇరువురిది ప్రచురింప దలిచాం. కనుక అలాంటివారిని గూర్చి బాగా తెలిసిన సన్నిహితులు ఈ విషయంలో మాకు తోడ్పడాలని ఆకాం క్షిస్తున్నాం.

మేనేజరు
ఆంధ్ర మహిళ

---

# ప్రార్థన

"శాంతరూపానంద జలరాశి వీవు
నవనవైకానంద నౌకను నేను
సంశుద్ధమానస సరసిని నేను
ఆనందమయ రాజహంసవు నీవు

సకల జీవామోద జలదంబ వీవు
నిర్మల సౌదామినీ రేఖను నేను
వరనందనోద్యాన వనలక్ష్మి నేను
తరుణశృంగార మాధవుడవు నీవు

సత్కళా సంపూర్ణ చంద్రుండ వీవు
సదమల చిద్రూప చంద్రిక నేను
లావణ్యమయ కల్పలతికను నేను
రాగరంజిత భృంగరాజంబ వీవు

దివ్యమూర్తివి నీవు దీప్తిని నేను
సర్వమంగళ నేను సర్వుండ వీవు
నీకుదక్కితి నాకు నీవు దక్కితివి
ఏలదాగెదవింక హృదయాధి నాథ

---

# ఆంధ్ర మహిళా సభ

## మైలాపూర్ - మద్రాసు

| | |
|---|---|
| మహిళా విద్యాలయము | : హిందీ, కాశీవిశ్వవిద్యాలయపు ఎడ్మిషన్, ఆంధ్రామెట్రిక్, ఇ.ఎస్.ఎల్.సి., పరీక్షలకు శిక్షణ. |
| పారిశ్రామిక విద్యాలయము | : కుట్టు, ఎంబ్రాయిడరీ, ఊలు అల్లికలు, నూలు వడకుట, చేనేత, అచ్చుకూర్పు, ముద్రణ, బైండింగ్ ఇత్యాది పరిశ్రమలలో గవర్నమెంటు పరీక్షలకు శిక్షణ, బీద విద్యార్థినులకు ఉచితము. |
| మహిళా మందిరము | : విద్యార్థినులకు వసతి గృహము. |
| ఆంధ్ర మహిళ | : స్త్రీలలో విద్యా వ్యాప్తికై స్త్రీలచే నడుపబడుచున్న సచిత్ర మాస పత్రిక |
| నర్సింగ్ హోమ్ | : స్త్రీ శిశు సంరక్షణశాల, ప్రసూతిశాల, ఉచిత వైద్యశాల, కుటుంబ నియంత్రణశాఖ, దంత వైద్యశాఖ—అడయారులో నిర్మించబడినది. భారత ప్రభుత్వ ఆరోగ్య శాఖవారి విధానాన్ని అనుసరించి, సంక్షిప్త నర్స్ఎయిడ్—మంత్రసాని పనులలో శిక్షణ యివ్వబడుచున్నది. ఫామిలీ ప్లానింగు వర్కర్సుకు శిక్షణకూడ యివ్వబడు చున్నది |
| ఆర్థోపీడిక్ సెంటర్ | : వికలాంగులగు బాలబాలికలకు సంరక్షణ, విద్య యిచ్చే సంక్షేమకేంద్రం. |
| ముద్రణాలయము | : విద్యార్థినులకు అచ్చుకూర్పు, బైండింగ్, ప్రూపురీడింగు, మొదలైనవి ఉచితంగా నేర్పబడును. ప్రింటింగు జాబ్ వర్క్సు చేయబడును. |
| నాగేశ్వర శిశువిహార్ | : పిల్లల విద్యావినోద కేంద్రం. ప్రాథమిక పాఠశాల నడుప బడుచున్నది |
| అర్బన్ వెల్ఫేరు ప్రాజెక్టు | : కపాలి తోట్టంలోను నారాయణస్వామి గార్డెన్‌లోను బీద లకు సంక్షేమ కార్యక్రమముల నిర్వహింపబడుతోంది |
| వనితా బాలవిహార్ | : స్త్రీలకు, పిల్లలకు- పార్కు, ఆటస్థలం. |
| రీజియనల్ హాండీక్రాఫ్ట్సు యిన్‌స్టిట్యూట్ | : ఆంధ్రమహిళాసభ, హైదరాబాదు బ్రాంచిచే నడుపబడుచున్న చేతిపనుల శిక్షణాలయము |

# ఆంధ్ర మహిళ

(ఆంధ్ర మహిళాలోకాభ్యుదయ మాసపత్రిక)

స్థాపకురాలు :

## శ్రీమతి దుర్గాబాయిదేశ్‌ముఖ్

విడి పత్రిక—37 నయాపైసాలు ప్రత్యేక వార్షిక సంచికతో కలిసి

సం॥ చందా - రూ. 6-00.

పంచాయతీ సంస్థలకు. సంక్షేమ సంఘాలకు, పౌరజన గ్రంథాలయాలకు

పాఠశాలా పుస్తక భాండాగారాలకు సగము చందా సం॥ రం॥ కి రూ. 3-00 లు.

## పత్రికా విక్రయసంస్థల యేజంట్లకు

1. 'ఆంధ్ర మహిళ' ఆరింటికంటె తక్కువ ప్రతులకు ఇచ్చే ఆర్డర్లు గమనింపబడవు.
2. పత్రికకు 1 కి 12 న. పైసాలు కమీషను ఇవ్వబడును. పోస్టేజి మేమేభరింతుము.
3. విక్రయంకాని సంచికలు వాపసు తీసికోబడవు.
4. ప్రతినెల "ఆంధ్ర మహిళ" ఎన్నిప్రతులు కావలెనో సూచిస్తూ. అసలుక్రయంలో కమీషను మొత్తం మినహాయించుకొని, తక్కిన మొత్తంతో వచ్చే ఆర్డర్లు అంగీకరింప బడును.
5. ప్రత్యేక వార్షిక సంచిక ప్రతి 1. కి రూ. 2 లు, అయినా, యేజంట్లకు రూ. 1. 50 కే, (అనగా 25. కమీషన్ మినహాయింపుతో) ఇవ్వబడుతుంది.

## ఆంధ్రమహిళ

### ప్రకటన రేట్లు

సామాన్యమైన పుట 1 కి. రూ 60. లు,

అట్టకాగితం 2 వ పుట, 3. వ పుట (2 కేరంగులతో) రూ 80 లు.

4. వ పుట (2 కేరంగులతో) రూ 100 లు.

కొయ్య దిమ్మెలుగల బ్లాకులు అంగీకరించ బడును. ప్రకటనలు. బ్లాకులు పత్రిక వెలువడే తారీఖునకు 10 దినములు ముందే మాకు చేరాలి.

మేనేజరు.
ఆంధ్రమహిళ
7 ఎ. రోజరీచర్చిరోడ్డు.
మైలాపూరు—మద్రాసు 4.

Printed by Andhra Mahila Press, & Published by Srimathi B. Thimmabai, Joint Secretary of